Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్‌రైతు

సంపుటి: 81 • సంచిక: 41 • 8-10-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





● జగన్‌నా? అనుచరులనా?

# వెలి వేయాల్సింది ఎవరిని?

జగన్ ఓదార్పు యాత్రకు మద్దతు ప్రకటించారన్న నేరంపై నెల్లూరు జిల్లా కాంగ్రెస్ యువకిశోరం కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డిని పార్టీ నుంచి వెలి వేసింది కాంగ్రెస్ నాయకత్వం. షోకాజ్ నోటీసు వంటి మర్యాదలు కూడా లేకుండా నేరుగా పార్టీ నుంచి సస్పెండ్ చేసి పారేసింది. జగన్ శిబిరంలో ఇటీవల కొంత కాలంగా కీలక పాత్ర పోషిస్తున్నాడు శ్రీధర్‌రెడ్డి. అంబటి రాంబాబు, కొండా సురేఖల తర్వాత అంతగా నోరు పారేసుకొంటున్నవాడు అతడే. అయితే వైఎస్. రాజశేఖర్‌రెడ్డి మరణం తర్వాత కాంగ్రెస్ పార్టీలో చాలామంది నేతలకు నోరు వదులై పోయింది. జగన్ అనుచరులే కాదు, రోశయ్య వీరభక్తులు, అధిష్టానం ప్రతినిధులమని చెప్పుకొనే వారు కూడా నోటికి ఎంత వస్తే అంత మాటా టీవీ ఛానళ్ల ముందు అనేస్తున్నారు. తెలంగాణవాదుల సంగతి చెప్పనే పని లేదు. వారి నోటికి ఢిల్లీ పెద్దలు లైసెన్స్ ఇచ్చారేమో అన్నంత ధీమాగా వాచాలత్వం ప్రదర్శిస్తున్నారు.

కాంగ్రెస్ పెద్దలకు జగన్ ఓదార్పు యాత్ర ఎంత మాత్రం ఇష్టం లేదు. ఆ సంగతి పదేపదే పలు రూపాలలో చెప్తూనే వున్నారు. సోనియాగాంధీ కూడా వద్దు అన్నది. కానీ జగన్ మాత్రం యాత్ర మానడం లేదు. నెలల తరబడి జరుపుతూనే వున్నాడు. మరొక సంవత్సరం ఆరు నెలలు ఇదే రీతిలో ఓదార్పు యాత్ర పేరిట రాష్ట్రంలో తిరగాలన్నది జగన్ ప్రణాళిక. ధిక్కారమును సహించలేమని అధిష్టానం హూంకరిస్తుంటే, మీ ఉడత వూపులకు వెరవబోమని జగన్ సవాలు చేస్తున్నాడు. నిజంగా యాత్రను ఆపడం పార్టీ సంకల్పమైతే, తమ మాట విన్పించుకోని జగన్‌ను తీసి బయటకు విసిరి పారేయాలి. ఆ సాహసం ఢిల్లీ పెద్దలెవరికీ లేదు. పొమ్మనకుండా పొగపెట్టడం మాత్రమే చేయగల్గుతున్నారు వారు. అందులో భాగమే జగన్‌ను సమర్థించే వారికి సస్పెన్షన్ శ్రీముఖాలు.

మరొకప్రక్క జగన్ పక్షంగా నిలబడిన ఎమ్పీలు, ఎమ్మెల్యేలు మంత్రుల జోలికి కూడా వెళ్లలేక పోతున్నది కాంగ్రెస్ పార్టీ. అధిష్టానం అంటే ఏమిటో నాకు తెలియదని గోదావరి జిల్లా యాత్రలో పాల్గొన్న పిల్లి సుభాష్‌చంద్రబోస్, మంత్రి పదవి నాకు వెంట్రుకతో సమానమని ప్రకటించిన ఒంగోలు బాలినేని శ్రీనివాసులురెడ్డి ఇంకా మంత్రిపదవులలో కొనసాగుతూనే వున్నారు. వారిని బహిష్కరించే దమ్ము ముఖ్యమంత్రి రోశయ్యకు లేదు. జగన్ ఓదార్పు యాత్ర భారం మొత్తం తమ భుజాల మీద మోస్తున్న ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి, కడప జిల్లా శాసన సభ్యులు నిక్షేపంగా పార్టీలో కొనసాగగల్గుతున్నారు. వారి జోలికి వెళ్లడానికి సాహసించడం లేదు పిసిసి అధ్యక్షుడు డి.శ్రీనివాస్. గుమ్మడి కాయలను వదలి నువ్వు గింజల కోసం వేలు అడ్డం పెట్టినట్లు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, అంబటి రాంబాబు వంటి వారిని మాత్రం సస్పెండ్ చేస్తున్నారు. సస్పెన్షన్లు, షోకాజ్ నోటీసుల ద్వారా జగన్‌తో ఎవరూ వెళ్లకుండా భయపెట్టాలన్నది కాంగ్రెస్ అభిమతమైతే, అంతకంటే నవ్వులపాలు విషయం వేరొకటి వుండదు.

నిజం చెప్పాలంటే, ఈ సస్పెన్షన్ల వల్ల అది చేయించుకొన్న వారికి మేలు జరుగుతున్నది. టీవీ ఛానళ్లు, దినపత్రికలలో వారికి ఉచిత ప్రచారం లభిస్తున్నది. వారి స్థాయి పెరిగిపోతున్నది.

జగన్ మీద చర్య తీసుకోకపోవడానికి కారణం – ఆయనకు అకారణంగా ప్రజలలో సానుభూతి పెరుగుతుందన్న సంకోచం. జగన్‌ను పార్టీలో కొనసాగించాలనే ఆలోచన అధిష్టానానికి ఏ కోశానా లేదు. ఆయన్ను వదిలించుకోవాలన్నదే వారి అభిమతం. జగన్ ఆలోచన కూడా అదే. తనంత తానుగా వెళ్తే, తప్పు తన మీద పడుతుంది కాబట్టి, వెళ్లగొట్టించుకోవాలని కోరిక. కానీ ఆయన ఎంత రెచ్చగొట్టినా అధిష్టానం స్పందించడం లేదు. ఇద్దరిమధ్య దోబూచులాట నడుస్తున్నది. ఇది ఇంకెంత కాలం కొనసాగితే అంతగా రాష్ట్రంలో పార్టీ మట్టి కొట్టుకొని పోతుంది.

## గద్దర్ రాకతో అందరి గుండెల్లో దడ



అసలే ఉడుకు మిడుకుగా వున్న తెలంగాణ ఉద్యమంలో ప్రజా గాయకుడు గద్దర్ ప్రవేశించాడు. కొత్తగా ఒక ఫ్రంట్ పెట్టాడు. ఇప్పటి వరకు తెలంగాణా ఉద్యమానికి సంకేతం కెసిఆర్ మాత్రమే. ఆయన టిఆర్ఎస్ పార్టీకి పట్టుమని పది మంది ఎమ్మెల్యేలు లేకపోయినా, ప్రజలలో ఆయన పేరు ప్రతిష్టలు అంతంతమాత్రమే అని మొన్నటి ఎన్నికలలో రుజువైనా, ఉద్యమాన్ని తనకనుకూలంగా తిప్పుకొంటున్నాడన్న విమర్శలున్నా, తన కుటుంబ సభ్యుల చందాల దండ కాలకు ఉద్యమాన్ని పణంగా పెడుతున్నాడన్న ఆరోపణలున్నా తెలంగాణా కావాలని

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్



సిఎం ఏ పనీ చేయట్లేదని... జనాలు అంటున్నారుగా... రోబోతో చేయిద్దామని తెప్పించాను సార్!

## నమ్మకాలు, విశ్వాసాలనుబట్టి తీర్పా?

ప్రళయాన్ని తలపించే ప్రచండ మారుతం వీస్తుందని ప్రాణాలు ఉగ్గబట్టి వేచిచూస్తున్న సమయంలో, పైరుగాలి మెల్లమెల్లగా వచ్చి పలకరిస్తే ప్రాణానికెంత హాయిగా వుంటుందో, రుచి చూపించింది అలహాబాద్ హైకోర్టు. అయోధ్య వివాదంపై త్రిసభ్య ధర్మాసనం ఇచ్చిన తీర్పు దేశం మొత్తానికి ఉపశమనం కల్గించింది. ఎంత భయపడ్డారు ఈ తీర్పు గురించి? కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకైతే ఊపిరి పిడికెట్లోకి వచ్చింది. లక్షల సంఖ్యలో పోలీస్ బలగాలను, సైనిక సిబ్బందిని రంగంలోకి దించి లక్నో, హైదరాబాద్, అహ్మదాబాద్, ఢిల్లీ, బొంబాయి వంటి నగరాలను యుద్ధభూమిగా మార్చారు. టివి ప్రసారాల మీద నిషేధాలను విధించారు. మొబైల్ ఫోన్ మెసేజ్‌లను అడ్డుకొన్నారు. ప్రజలు కూడా ఇళ్లలో నుంచి తల బయటపెట్టి చూడడానికి భయపడ్డారు. స్కూళ్లకు సెలవిచ్చారు. ఆఫీసులు మూసివేశారు. అన్ని పనులు మానుకొని టివిలలో వచ్చే తీర్పు వివరాల కోసం ఊపిరి బిగబట్టి ఎదురు చూసింది నూరు కోట్ల ప్రజానీకం.

కానీ హైకోర్టు తీర్పు తొలకరి చినుకులంత చల్లగా వచ్చింది. న్యాయమూర్తులు ముగ్గురూ చట్టం, న్యాయం కంటే, ప్రజల విశ్వాసాలకు అధిక ప్రాధాన్యత ఇచ్చి, పంచాయితీ పెద్దమనుషుల మధ్యస్థం వంటి తీర్పును వెలువరించారు. అయోధ్యలో వివాదాస్పద స్థలాన్ని హిందువులు, ముస్లింలు, హిందు సంస్థ నిర్మోహి అఖారాలకు మూడు సమాన భాగాలుగా విభజించి పంచాలన్నది తీర్పు సారాంశం. ఎవరికి కేటాయించిన భాగంలో వారు తమకు నచ్చిన ప్రార్థన మందిరం నిర్మించుకోవచ్చన్నది తీర్పు. ఈ కేసులోని సవాలక్ష వివాదాంశాలపై న్యాయమూర్తులు ముగ్గురూ సుదీర్ఘమైన పరిశీలనే చేశారు. అందువల్లే ఎప్పుడూ లేనట్లు 8500 పేజీల తీర్పు వెలువడింది. అయితే మధ్యస్థాన్ని పోలిన తీర్పు వల్ల ఆ వివాదాలపై ప్రజల చర్చ కేంద్రీకృతం కాలేదు. విడి విడి భాగాల పంపకం మీదనే అందరి దృష్టి వుంది ఇప్పుడు.

ఇక్కడ మనం పరిశీలించవలసిన విషయాలు ప్రధానంగా రెండు. మొదటిది 1992లో బాబ్రీ మసీదు కూలగొట్టిన నాటికి, నేటికి రాజకీయ పార్టీలలో, ప్రజలలో వచ్చిన పరిణితి. ఈ ఇరవై ఏళ్లలో జరిగిన ఆర్థిక అభివృద్ధి మూలంగా యువతరంలో ఇటువంటి ఉద్రేకపూరిత అంశాల కంటే, తమ జీవనాన్ని మెరుగు పరచుకోవడం పైన అధిక దృష్టి పెట్టే అలవాటు అబ్బింది. దానితో ఒకరు రెచ్చగొట్టినా రెచ్చిపోయేందుకు వారు సిద్ధంగా లేరు. అందువల్లనే ఇంత కీలక సమయంలో కూడా దేశం యావత్తు అంతా సంయమనం పాటించింది.

రెండవది – కోర్టు తీర్పు వల్ల ఎవరికి న్యాయం జరిగింది అన్న పరిశీలన. ముస్లింలు తమకు బాబ్రీ మసీదు స్థలం కావాలని అడగలేదు. అక్కడున్న తమ ప్రధాన మందిరంపై హిందువుల దౌష్ట్యం ఏమిటని ప్రశ్నించారు. హిందు సంస్థలు మాత్రం అక్కడ తమ ఆరాధ్య దైవమైన రాముడు పుట్టాడని తమ నమ్మకం కాబట్టి, ఆ స్థానంలోని మసీదు కూలగొట్టి, రామాలయం నిర్మించుకొంటామని కోరాయి. ఇందులో ఎవరిది అసంబద్ధమైన వాదనో వివరించి చెప్పనవసరం లేదు. రాముడు అయోధ్యలోనే పుట్టాడనడానికి చారిత్రక ఆధారాలు అసాధ్యం. రాముడు అనేది రామాయణంలో ఒక పాత్ర మాత్రమే. అది జరిగిన కథ అనుకొన్నా, దాని కాలం 17 లక్షల సంవత్సరాల నాటిది. అంత పురాతన కాలంలో మనిషి నాగరికత నేర్చిన దాఖలాలు లేవు. అందువల్ల రాముడు అనేది కేవలం నమ్మకం. ఎవరికి తోచిన నమ్మకాలు వారు ఏర్పరచుకోవడంలో తప్పులేదు. కానీ మా నమ్మకం అది కాబట్టి, ఇతర మతాల వారి మందిరాలు తొలగించి తమ దేవాలయం కట్టుకొంటామని అడగడం న్యాయం కాదు. న్యాయం కాని అంశాలను న్యాయస్థానాలు చేపట్టకూడదు. చేపట్టినా నమ్మకాలను బట్టి, మత విశ్వాసాలను బట్టి తీర్పులు చెప్పకూడదు. అలహాబాద్ న్యాయమూర్తులు ఆ తప్పు చేశారు. వారి తీర్పు అందరికీ ఆమోదయోగ్యంగా వుండవచ్చు. కానీ అది న్యాయం దృష్టిలో చూస్తే చెత్త కాగితం క్రింద లెక్క.

ఈ వివాదం ఇకముందు సుప్రీంకోర్టు పరిధిలోకి వెళ్తున్నది కాబట్టి, ఆ న్యాయమూర్తులైనా మత విశ్వాసాలకు లోను కాకుండా న్యాయం, చట్టం, ధర్మం అనే సూత్రాల ఆధారంగా ఈ వివాదాన్ని పరిష్కరిస్తారని ఆశిద్దాం.

జమీన్‌రైతు

## జనవాణి

### అయోధ్యపై తీర్పు అమోఘం

60ఏళ్ల కాగుతున్న అయోధ్యలోని వివాదాస్పద భూమిపై సెప్టెంబర్ 30వ తేది అలహాబాద్ హైకోర్టు ఇచ్చిన తీర్పు అమోఘం. న్యాయమూర్తులు ఈ కేసులో కక్షిదారులైన హిందూ, ముస్లిం, అఖారా సంస్థలలో ఏ ఒక్కరికి అన్యాయం జరుగకుండా వివాదాస్పద భూమిని ముగ్గురికి పంచాలని ప్రకటించడం సహేతుకం. ఈ వ్యవహారంలో ఇంతకన్నా మంచి తీర్పు సాధ్యం కాదు. ఈ తీర్పు వెలువడ్డాక దేశంలో చిన్నపాటి సంఘటన కూడా జరగలేదంటే దీనికి కారణం ఈ తీర్పును అన్నివర్గాలు మన్నించాయని అర్థం చేసుకోవాలి.

పి.అరుణకుమారి, నెల్లూరు

### బ్లాక్ టిక్కెట్ల అమ్మకాన్ని ఆపండి!

నెల్లూరు నగరంలోని సినిమా హాళ్లలో బ్లాక్ టిక్కెట్ల అమ్మకం ఎక్కువయ్యింది. క్రేజున్న హీరోల సినిమాలు వచ్చినప్పుడు మూడు రోజులపాటు వరుసగా టిక్కెట్లు బ్లాక్ చేస్తున్నారు. దీనివల్ల సామాన్య ప్రేక్షకులు సినిమాలు చూడలేకపోతున్నారు. జిల్లా అధికార యంత్రాంగం ఈ వ్యవహారమై స్పందించకపోవడం బాధాకరం.

టి.ప్రవీణ్, నెల్లూరు

### అక్కడ వైఎస్ విగ్రహం పొరపాటే!

నెల్లూరు గాంధీబొమ్మ సెంటర్‌లో జాతిపిత మహాత్మా గాంధీ మహాత్ముని విగ్రహానికి ప్రక్కనే మాజీ ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి విగ్రహ ప్రతిష్ఠాపన కార్యక్రమాలు జరుగుతున్నాయి. నెల్లూరులో వైఎస్ రాజశేఖర్‌రెడ్డి విగ్రహం ఏర్పాటు చేయడం తప్పుకాదు. కానీ ఎంచుకొన్న స్థలం సరైనది కాదు. విగ్రహ ఏర్పాటు వివాదాస్పదమై ఎన్నో ఏళ్లుగా వున్న గాంధీ విగ్రహం కంటే పెద్దదైన రాజశేఖర్‌రెడ్డి విగ్రహం పెట్టడం దాన్ని రాజీవ్‌భవన్ వర్గాలు సమర్థించుకోవడం పొరపాటు.

దిడ్డి సుబ్బారావు, నెల్లూరు

### హిందూ సోదరులకు ఇద్దాం!

స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుంచి నలుగుతున్న వాజ్యం బాబ్రీ మసీదు – రామ జన్మభూమి వివాదంపై అలహాబాద్ హైకోర్టు తీర్పు వెలువరించింది. ఈ తీర్పును పరిశీలిస్తే ఆ స్థలం అనాదిగా హిందూ సోదరులకున్న మనోభావం

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

11-10-1940
పేజీలు : 16 వెల: అణా

### ఏమిటీ అన్యాయం

నెల్లూరు జైలులో లాకప్‌లో వున్న శిక్షితులైన రాజకీయ ఖైదీలను, ఒక్కొక్కరిని బయటకు లాగి లాఠీలతోనూ, చెప్పులతోనూ వార్డర్లు చాలా మంది కలసి కొట్టినారట. ఇది జరిగింది సెప్టెంబరు 15వ తారీఖునట.

30వ తారీఖున ఖైదీలలో ఒకరైన కోయంబత్తూరు వాస్తవ్యులు రామయ్యగారు విడుదల పొంది, చెన్నపట్నం వచ్చి, అక్టోబర్ 3వ తారీఖున పత్రికల్లో ప్రకటించారు. జైలధికార్లు దీనికి జవాబు చెప్పుచూ, వుచ్చుకుండలు తీసి వార్డర్ల మీద ఖైదీలు వేసినారు గనుక, ఈ రచ్చ జరిగినది అని అంటున్నారు.

రామయ్య గారి ప్రకటన ప్రకారం ఖైదీలను కొట్టినప్పుడు జైలరుగానీ సూపరింటెండెంట్ గానీ అక్కడ లేనేలేరట.

పై అధికార్ల ఎరక లేకుండా ఇదంతా జరిగినదా! నిజంగా ఏం జరిగింది? దీన్ని గూర్చి ప్రభుత్వం విచారిస్తారా?

### మహారాణి గారి నిర్యాణం

వెంకటగిరి సీనియర్ మహారాణి గారు అంటే 1916లో గుండె జబ్బుతో చనిపోయిన మహారాజా గారి ధర్మపత్ని గారు 5వ తేది పరమ పదించినది. ఈమె గారి జ్ఞాపకార్థం ఒక చెరువు త్రవ్వించమని కాదు కాదు ఒక చెరువు రిపేరు చేయించమని సలహా ఇవ్వవచ్చునా?

### నెల్లూరు దసరా విశేషాలు

ఇంతవరకూ నెల్లూరు శాంతంగానే వున్నది. పోలీసు బందోబస్తు వూరి నిండా వస్తున్నది. పులివేషాలు హిందువులు వేయడానికి కలెక్టరు గారు పర్మిషను యివ్వలేదు. అందుకు గురించిన రికార్డంతా దాఖలు చేస్తే, పై అధికార్లు పంపిన మీదట, పర్మిషను వస్తే వచ్చేసారి నుండి వేసుకోవచ్చునని కలెక్టర్ గారు హిందూ నాయకులకు సమాధాన పూర్వకంగా చెప్పినారట.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

7-10-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### యు.పి ముఖ్యమంత్రిగా విజయలక్ష్మీ పండిట్

ఉత్తరప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్ష పోటీలో ముఖ్యమంత్రి సంపూర్ణానంద్ అభ్యర్థి ఓడిపోయాడు. వ్యతిరేక వర్గ నాయకుడైన చంద్రభాను గుప్త ఎన్నికైనాడు. తాను రాజీనామా యిచ్చుటకు అనుమతించవలసిందిగా సంపూర్ణానంద్ హైకమాండును కోరాడు. ఉత్తరప్రదేశ్ కాంగ్రెస్ రాజకీయాలు హైకమాండు చేయి గూడా దాటిపోయినది. సంపూర్ణానంద్ కడకు రాజీనామా యివ్వడమే జరిగితే, వారి స్థానంలో శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ ముఖ్యమంత్రి కావచ్చుననే వార్తలొస్తున్నవి. ఈ వార్త యిప్పుడే గాదు. కొంత కాలంగా ప్రచారంలో వుంది. ఈ సందర్భంలో బొంబాయి గవర్నరు శ్రీప్రకాశ పేరు గూడా వినిపిస్తున్నది.

### ఎస్పీ బదలీ

జిల్లా పోలీసు సూపరింటెండెంటు ఆర్.కె.మునుస్వామి వరంగల్ మార్చబడి, వారి స్థానంలో పి.వి.రంగయ్యానాయుడు ఐపిఎస్ నియమింపబడ్డారు. మునుస్వామి గారు పోయారు. కొత్త ఎస్పీ నిన్న ఛార్జి తీసుకొన్నారు. మునుస్వామి గారి పాలన బిగువుగా లేకపోయినా, నిష్పాక్షికంగా సాఫీగా సాగిపోయింది. ఇటీవల విశేష ప్రాధాన్యంతో ప్రకటింపబడిన హత్యలు, వీరి బదలీ కాకతాళీయమేగానీ బదలీకి కారణం అది కాదంటారు. క్రొత్త ఎస్పీ రంగయ్యానాయుడు హైదరాబాదులో డిప్టీ పోలీస్ కమిషనర్‌గా పనిచేసి ఎస్పీగా ఇటీవలే ప్రమోట్ అయినారని, తూర్పు గోదావరి వాస్తవ్యులని, యువకులని తెలుస్తున్నది.

### నాగయ్య గారింట వివాహం

సెప్టెంబర్ 30వ తేది ఉదయం మద్రాస్‌లోని మాంబళంలోని రామానుజకూటంలో నటశేఖరులైన వి.నాగయ్య గారు తమ సోదరుని పుత్రిక లక్ష్మీనరసమాంబను ఓరుగంటి మల్లికార్జునయ్య బి.కాం, సి.ఏ, ఐఐబికి ఇచ్చి వైభవంగా వివాహం జరిపారు. సాయంకాలం ఘంటసాల తమ ఆర్కెస్ట్రాతో మధురగానం చేశారు. విందు అనంతరం ఎస్‌డి సుబ్బులక్ష్మి గారిచే సీతాకళ్యాణం హరికథా కాలక్షేపం జరిగింది.

# నెల్లూరు ముచ్చట్లు
## విశ్లేషకుడు

### డెంగీ జ్వరాలను పట్టించుకోరా?

జిల్లాలో డెంగీ జ్వరపీడితుల సంఖ్య రోజురోజుకు పెరిగి పోతుంది. తమకు వచ్చింది ఏ రకం జ్వరమో తెలుసుకొనేలోపు జనం ప్రాణాలు అనంత వాయువుల్లో కలసి పోతున్నాయి. ఈ సీజన్‌లో ఇప్పటివరకు డెంగీ జ్వరం సోకి 50 మంది ప్రాణాలు కోల్పోయారంటే అతి శయోక్తి కాదు. ఈ వారంలోనే కావలిలో నలుగురు, తోటపల్లిగూడూరు ఇస్కపాళెంలో ఇద్దరు ప్రాణాలు కోల్పోయారు. డెంగీ జ్వరం సోకిన వారికి తక్షణం ప్లేట్‌లెట్స్ ఎక్కించాలి, లేకుంటే రక్తంలో తెల్ల రక్తకణాల సంఖ్య తగ్గి మరణం సంభవిస్తుంది. నెల్లూరు, ప్రకాశం, చిత్తూరు జిల్లాలకు కలిపి రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంకులోనే ప్లేట్‌లెట్స్ అందుబాటులో వుంటున్నాయి. ఇవి జ్వరపీడితులకు ఏమాత్రం చాలడం లేదు. నెల్లూరు పెద్దాసుపత్రిలో ప్లేట్‌లెట్స్ తయారుచేసే అజిటేటర్ మిషన్లు తెప్పించి రెండేళ్లు అయినా తయారీకి అనుమతి రాలేదు. దీనివెనుక రాజకీయం వుందని ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి.

డెంగీ జ్వరాలు రాకుండా గ్రామాల్లో పారిశుధ్య పరిస్థితులు మెరుగుపర్చను పంచాయితీలతో కలసి వైద్య ఆరోగ్యశాఖ పని చేయలేక పోతుంది. ఈ వ్యవహారంలో జిల్లా అధికార యంత్రాంగం కుంభకర్ణ నిద్రలో వుంది. వారు మేల్కొని జ్వర నియంత్రణ చర్యలు, పెద్దాసుపత్రిలో ప్లేట్‌లెట్స్ తయారీకి అనుమతి మంజూరు చేస్తే బాగుంటుంది. డెంగీ జ్వరం చికిత్సకు చెన్నై వెళ్తున్న వారికి తక్కువంటే రెండు లక్షలు ఖర్చువుతున్నాయి. ఇంత మొత్తం ఎందరు భరించగలరు కలెక్టర్‌గారూ?



### జగన్ ఓదార్పు 11న?

జిల్లాలో కడప ఎమ్పీ వైఎస్ జగన్మోహన్‌రెడ్డి ఓదార్పుయాత్ర ఈ నెల 11వ తేదీ ప్రారంభం కావచ్చంటున్నారు. రూట్‌మ్యాప్‌లో ముందుగా పేర్కొన్న కావలి మండలం రుద్రకోట నుంచే ఇది మొదలవుతుంది.

### నెల్లూరులో రెండే వైఎస్ విగ్రహాలు!

జగన్ ఓదార్పుయాత్రను పురస్కరించుకొని నెల్లూరు నగరంలో దివంగత ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి విగ్రహాలు రెండు మాత్రమే ఆవిష్కరిస్తారు. ఇందులో ఒకటి గాంధీబొమ్మ వద్ద రాజీవ్‌భవన్ ఏర్పాటు చేస్తుండగా, మూలాపేట సిఏఎం స్కూల్ జంక్షన్‌లో మరొకటి పెడుతున్నారు. జిల్లాలో మాత్రం 400లకు పైగా వైఎస్ విగ్రహాలను జగన్ ఆవిష్కరిస్తారు.

### ఏఐసిసి ఓదార్పు కొంతే!

వైఎస్ రాజశేఖర్‌రెడ్డి మరణాన్ని తట్టుకోలేక జిల్లాలో మరణించిన వెంకటాచలం మండలం పూడిపర్తి వాసి సారంగం సురేష్, దుత్తలూరు మండలం పెదవుత్తేడు వాసి వడ్లపూడి రమణయ్య, ఎఎస్‌పేటకు చెందిన గరికపాటి వెంకయ్య, సైదాపురం మండలం మరియపూడికి చెందిన పీర్ల పెదవెంకు, కావలికి చెందిన బత్తల కృష్ణవేణమ్మ, అల్లూరు మండలం ఇస్కపల్లికి చెందిన తమ్మి బ్రహ్మయ్య, తడకు చెందిన కొండ వాసం సరోజనమ్మ, దుత్తలూరు సోమల రేడుకు చెందిన ఆంధ్రా అర్చిత్‌ల కుటుంబాలకు లక్ష రూపాయల చొప్పున సహాయం చేయాలని ఏఐసిసి నిశ్చయించింది. ఈ మేరకు ఈ జాబితాను డిసిసి పిసిసికి, పిసిసి ఏఐసిసికి పంపింది.

వైఎస్ జగన్మోహన్‌రెడ్డి మాత్రం తన ఓదార్పు యాత్రలో జిల్లాలో 38 మందికి ఆర్థిక సహాయం అందించను న్నారు. వీరిలో పైన పేర్కొన్న వారంతా వున్నారు.

### ఛార్మీకోసం వివేకా ఎదురుచూపులు!

నెల్లూరు నగరంలో ఏదైనా ప్రారంభోత్సవాల సందర్భంగా రూరల్ ఎమ్మెల్యే చేసే సందడి అంతా ఇంతా కాదు. అప్పటి మేయర్ భానుశ్రీతో కలసి రకరకాల వస్త్రధారణ, నగల ధారణలతో ఫోటోలు దిగేవారు. ఈ వారంలో జరిగిన ఆర్ – 9000 వస్త్ర దుకాణం ప్రారంభోత్సవానికి ఉదయం 10.30 గంటలకే వివేకానందరెడ్డి తన జంట లేకుండా విచ్చేశారు. నటి ఛార్మి ఏమో 11.20 గంటలకు వచ్చింది. 50 నిమిషాలపాటు వేచి చూడడం వివేకానుఇబ్బంది పెట్టినా ఛార్మి కోసం వుండక తప్పలేదు. యధాతథంగా ఆమె బుగ్గ గిల్లి వెళ్లారాయన.

### కన్యకా పరమేశ్వరి దేవస్థానంలో దసరా!

నెల్లూరు స్టోన్‌హౌస్‌పేటలోని కన్యకా పరమేశ్వరి అమ్మవారి దేవస్థానంలో దేవీ శరన్నవరాత్రులు 8వ తేదీ నుంచి 18వ తేదీ వరకు జరుగుతాయి. 8వ తేదీ కలశస్థాపన, 9వ తేదీ అన్నపూర్ణ, 10వ తేదీ బాల త్రిపురసుందరి, 11వ తేదీ రాజరాజేశ్వరి దేవి, 12వ తేదీ గాయత్రి, 13వ తేదీ సరస్వతి, 14వ తేదీ ధనలక్ష్మి, 15వ తేదీ మహిషాసుర మర్థిని, 16వ తేదీ గజలక్ష్మి అలంకారాలను అమ్మవారికి చేస్తారు. 17వ తేదీ విజయదశమిని పురస్కరించుకొని నగరోత్సవం జరుగుతుంది. 18వ తేదీ వసంతోత్సవం సందర్భంగా దర్బార్ అలంకారముంటుంది. ప్రత్యేక పూజల్లో భాగంగా సహస్ర నామార్చన, వివాహ వరమాల, నిత్య సహస్ర నామార్చనలు కూడా జరుగుతాయి. ఈసారి కన్య పూజకు లాస్య ప్రియను సిద్ధం చేస్తున్నారు. అమ్మవారి భక్తులను ఈ కార్యక్రమాలకు తరలి రమ్మంటున్నారు దేవస్థానం ఛైర్మన్ మునగా వెంకటేశ్వర్లు, కార్యదర్శి మంచి కంటి శ్రీనివాసులు, కోశాధికారి వాయిగుండ్ల సాయి సువర్ణ.

### గాంధీ ఆశ్రమానికి పార్వతమ్మ విరాళం!

పల్లెపాడులోని గాంధీజి పినాకినీ ఆశ్రమ అభివృద్ధికి కావలి మాజీ ఎమ్మెల్యే మాగుంట పార్వతమ్మ ఐదు లక్షల రూపాయల విరాళమందించారు. అక్టోబరు 2వ తేదీ ఇక్కడ జరిగిన జాతి పిత జయంతి సభలో ఆమె పాల్గొని మాట్లాడారు. తాను చిన్నతనంలో సబర్మతి ఆశ్రమంలో వుండినానని, గాంధీజి చెప్పిన సూక్తులు ఇప్పటికీ పాటిస్తున్నానన్నారు. ఈ కార్యక్రమంలో రెడ్‌క్రాస్ కార్యదర్శి డాక్టర్ ఎవి సుబ్రహ్మణ్యం, ఆశ్రమ నిర్వాహకుడు గణేశం కృష్ణారెడ్డి, షార్ కేంద్రం శాస్త్రవేత్త సుందరేశం తదితరులు పాల్గొన్నారు.

### ముత్యాలమ్మ దేవస్థానం ఛైర్మన్‌గా వేమారెడ్డి!

చిల్లకూరు మండలం తూర్పు కనుపూరు గ్రామం ముత్యాలమ్మ అమ్మవారి దేవస్థానం ట్రస్టుబోర్డు ఛైర్మన్‌గా వరగలికి చెందిన వేమారెడ్డి మురళీమోహన్ రెడ్డి 6వ తేదీ ప్రమాణ స్వీకారం చేశారు. 11వ తేదీ వేమారెడ్డి అనుచరులు దేవస్థానం దగ్గర అభినందన సభ ఏర్పాటు చేస్తున్నారు. దీనిలో కేంద్ర మంత్రి పనబాక లక్ష్మి, రాష్ట్ర మంత్రి ఆనం రామనారాయణరెడ్డి పాల్గొంటారు.

### జొన్నవాడ కామాక్షమ్మ దేవస్థానంలో దసరా!

జొన్నవాడలో వెలసిన మల్లిఖార్జున స్వామి సమేత కామాక్షితాయి దేవస్థానంలో దసరా శరన్నవరాత్రులు 8వ తేదీ నుంచి 17వ తేదీ వరకు జరుగుతాయి. 8వ తేదీ కలశస్థాపన, 9వ తేదీ త్రిపురాంబిక అలంకారం, 10వ తేదీ రక్తబీజ వధ అలంకారం, 11వ తేదీ మధుకైటభ వధ అలంకారం, 12న రాజరాజేశ్వరి అలంకారం, 13న సరస్వతి అలంకారం,

కొరవ 14వ పేజీలో



ఈ స్థలంలోనే రోడ్డు మార్జిన్ వ్యాపారుల కోసం కొత్త మార్కెట్ ఏర్పాటుకు నిధులు మంజూరయ్యాయి.

## కొత్త మార్కెట్‌లో షాపుల పేరిట వసూళ్లు!

నీతి, న్యాయంలేని రోజులివి. అధికారంలో వుండేవాళ్లు మరీ దిగజారి తమ చిత్తానుసారంగా ప్రవర్తిస్తున్నా అడిగే నాథుడు, అడ్డుకొనే ఉన్నతాధికారులు లేకుండా పోయారు. నెల్లూరు ఎసి కూరగాయల మార్కెట్ బయట బుట్టల్లో కూరగాయలు పెట్టుకొని రోడ్డు మార్జిన్ వ్యాపారస్తులు బతికేవాళ్లు. వీరివల్ల ట్రాఫిక్‌కు ఎటువంటి ఇబ్బందులు లేకపోయినా పోలీసులను శిఖండిగా పెట్టి వారిని ఆరు నెలల క్రితం ఈడ్చిపడేశారు. 300 మందికి పైగా రోడ్డు మార్జిన్ వ్యాపారులు జిల్లా కలెక్టర్, ఎస్పీలను కలసినా ప్రయోజనం లేకుండా పోయింది. ఈ వ్యాపారులంతా సిపిఎం గూటి నుంచి తమ గూటికి వచ్చే వరకు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి వీరితో మాట్లాడనే ఇష్టపడలేదు. ఇది జరిగాక విపరీతమైన వత్తిడుల నడుమ ఎసి మార్కెట్ ప్రక్కనే పాత కోనేరు స్థలంలో రోడ్డు మార్జిన్ వ్యాపారులకు తాత్కాలిక మార్కెట్ నిర్మాణానికి మార్కెటింగ్ శాఖ మూడు కోట్ల రూపాయలు మంజూరు చేసింది. ఈ నిధులు వెచ్చించి ఇక్కడ మార్కెట్‌ను కట్టకుండా రోడ్డు మార్జిన్ వ్యాపారుల వద్దే షాపుకు లక్ష నుంచి రెండు లక్షల వరకు ఇవ్వాలని వివేకానందరెడ్డి అనుచరులు వసూలు చేస్తున్నట్లు విశ్వసనీయంగా తెలిసింది. రోడ్డు మార్జిన్ వ్యాపారులు రూరల్ మండలంలోని కూరగాయల తోటల యజమానులకు ఒకేసారి బుట్ట కూరగాయలకు డబ్బు కట్టను తాహతులేని సామాన్యులు. రూరల్ ఎమ్మెల్యే ఏజెంట్లు అడిగిన మొత్తాలు ఇవ్వకుంటే మరో రకం వ్యాపారులకు ఈ షాపులు ధారాదత్తం చేయను మరో బ్యాచ్ విశ్వయత్నాలు చేస్తుంది. జిల్లా కలెక్టర్ ఈ విషయం చిన్నదని భావించకుండా పరిశీలించి బాధితులకు న్యాయం చేయాల్సి వుంది.



## ఎలక్ట్రానిక్ తక్కెడుంటే ఒట్టు!

నెల్లూరు నగరంలో అతి పెద్దదైన డైకస్‌రోడ్డులోని చేపలు, మాంసం మార్కెట్‌లో తూకం మరీ ఘోరంగా తయారయ్యింది. ఇక్కడ దరిదాపులు వందకులోపు చేపలు, రొయ్యల అంగళ్లు, 50కి పైగా మాంసం, మరికొన్ని కూరగాయల అంగళ్లు వున్నాయి. ప్రతినిత్యం లక్షలాది రూపాయల చేపలు, రొయ్యలు, మాంసం ఇక్కడ అమ్ముడవుతుంది. కానీ ఇంత వ్యాపారం జరిగే ఈ మార్కెట్‌లో ఒక్క ఎలక్ట్రానిక్ తక్కెడ కూడా లేదు. పాతకాలం నాటి డాలా తక్కెడలతో మోసపు తూకం తూస్తున్నారు. కిలో చేపలు, రొయ్యలు కొంటే 650 గ్రాములు 700 గ్రాములే వుంటున్నాయి. దీనివల్ల వినియోగదారులు తీవ్రంగా నష్టపోవాల్సి వస్తుంది. తూకాన్ని గూర్చి ఎవరైనా ప్రశ్నిస్తే మార్కెట్‌లో దొంగ వ్యాపారులంతా వారిపై ఒక్కసారి గయ్‌మని లేస్తారు. వీరి దెబ్బకు ఎంతటి ధైర్యస్తుడైనా మార్కెట్‌లో నోరు మెదపలేని పరిస్థితి. నగరంలోని కూరగాయలు, చేపలు, మాంసం మార్కెట్లలో ఎలక్ట్రానిక్ తక్కెడలు లేకుంటే ఊరుకోనని జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్ గతంలో చెప్పారు. ఈ మాట చెప్పి ఆరు నెలలు కావస్తున్నా ఇంతవరకు రెండు మార్కెట్లలో వీటిని పెట్టుకొన్న వ్యాపారి లేడు. తూనికలు, కొలతలు, కార్పొరేషన్ శానిటరీ విభాగం అధికారులు లంచాలు మరిగి కళ్లులేని కబోదుల్లా తయారవ్వడం వల్ల జనం వందలాది రూపాయలు వెచ్చించి కూడా తూకం సరిగ్గా వుండే మాంసాహారాన్ని ఇళ్లకు తీసుకెళ్లలేకపోతున్నారు.

## సమయ పాలనలేని గణం

### మంత్రి, ఎమ్మెల్యేలు, కలెక్టర్ అందరూ అందరే!







నెల్లూరు నగరంలో ఏర్పాటు చేస్తున్న సభలు, సమావేశాలు, శంకుస్థాపనలు, ప్రారంభోత్సవాలకు ఇటు రాజకీయ నాయకులు, అటు అధికార గణం చెప్పిన సమయానికి రావడం లేదు. దీంతో కార్యనిర్వాహకులు, ప్రజలు, మీడియా నానా పాట్లు పడాల్సి వస్తుంది. నగరంలో జరిగే కార్యక్రమాల్లో సహజంగా మంత్రి రామనారాయణరెడ్డి, రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, సిటీ ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి హాజరవుతుంటారు. ప్రభుత్వ కార్యక్రమాలకైతే కలెక్టర్, కార్పొరేషన్ కమిషనర్, ఇతర శాఖాధికారులు రావాల్సిందే. రామనారాయణరెడ్డి చెప్పిన సమయానికి ఒకటిన్నర గంట, వివేకా మరీ లేటుగా వస్తుండడం చర్చనీయాంశంగా మారింది. వైఎస్ రాజశేఖర్ రెడ్డి తొలి వర్థంతి రోజు కళాక్షేత్రం ఏర్పాటుచేసిన అధికారిక కార్యక్రమానికి వివేకానందరెడ్డి కోసం అధికారులు మూడు గంటల పాటు వేచి చూడాల్సి వచ్చింది. ఇటీవల జరిగిన మునిసిపల్ శంకుస్థాపనలకు వివేకా, శ్రీధర్‌కృష్ణారెడ్డి లేటుగా హాజరవ్వడంతో కొన్ని ప్రాంతాల్లో స్థానికులే లేని పరిస్థితి నెలకొనింది. నగరంలో 2వ తేది జరిగిన ఓ కార్యక్రమంలో సినీనటి కోసం రూరల్ ఎమ్మెల్యే గంటపాటు నిరీక్షించాల్సి వచ్చింది. ఇటువంటి పరిస్థితి స్వయంగా ఆయనకు ఎదురైనా వివేకా మారడం లేదు.అధికారగణంలో జిల్లా కలెక్టర్, జాయింట్ కలెక్టర్ ప్రజావిజ్ఞప్తుల దినం రోజు సైతం 11 గంటలపైనే హాజరవుతున్నారు. బంగ్లాలో ఈ అధికారులిద్దరూ ప్రజలను కలవను ఇష్టపడరు. దీనివల్ల జనం కలక్టరేట్‌లో వీరికోసం నానా తిప్పలు పడి వుండాల్సి వస్తుంది. సమయ పాలనలో ఎస్పీ దామోదర్ మిగతా అధికారుల కంటే మెరుగని చెప్పొచ్చు. సమయ పాలన లేని అధికారగణం, ప్రజాప్రతినిధులతో ప్రజలకు మొత్తం మీద ఇబ్బందులు తప్పడం లేదు. వీరి వ్యవహార శైలి మారాలని ప్రజలు కోరుకొంటున్నారు.

## భ్రష్టు పట్టిన బియిడి కాలేజి

### ● అయ్యోరే కీచకుడు



డిఇఓను నిలదీస్తున్న బియిడి కాలేజి విద్యార్థినులు.

ఎంతో మంది ఉపాధ్యాయులనందించి ఘనత వహించిన నెల్లూరులోని ప్రభుత్వ బియిడి కళాశాల నేడు లైంగిక వేధింపులకు, పలు అక్రమాలకు నిలయంగా మారింది. సంతపేటలో గల బియిడి కళాశాలకు ఎంతో గొప్ప పేరు వుండింది. అది కాస్త పెన్న పాలైంది. భావి ఉపాధ్యాయులను తీర్చి దిద్దాల్సిన అధ్యాపకులు వారి పట్ల అసభ్యంగా ప్రవర్తిస్తూ, అకృత్యాలకు పాల్పడడంతో కళాశాల పేరు మసకబారింది. దీనికితోడు ప్రభుత్వ నిబంధనలకు విరుద్ధంగా విద్యార్థుల వద్ద నుంచి అధిక ఫీజులు వసూలు చేస్తుండడంతో విద్యార్థులు అల్లాడిపోతున్నారు. ఆడపిల్లల పరిస్థితి దారుణంగా మారింది. ఈ కళాశాలలో సైకాలజీ లెక్చరర్‌గా పనిచేసే నరసింహారెడ్డి అనే ప్రబుద్ధుడు విద్యార్థినుల పట్ల అసభ్యంగా ప్రవర్తిస్తుండడంతో చాలా కాలం పాటు బయటికి చెప్పుకోలేక తమలో తామే దిగమింగుకొని వుండినారు. అది కాస్త ఎస్‌ఎఫ్‌ఐ విద్యార్థి సంఘానికి తెలియడంతో వారు విద్యార్థినులకు అండగా నిలచి ఆందోళనకు దిగారు. అసభ్యకరంగా ప్రవర్తిస్తున్న సైకాలజీ లెక్చరర్ నరసింహారెడ్డిపై చర్యలు తీసుకోవాలని, అధిక ఫీజుల వసూళ్లపై విచారణ జరపాలని డిమాండ్ చేశారు. దీనిపై మహిళా అధికారిణిని విచారణకు పంపకుండా డిఇఓ కళాశాలకు వచ్చి బాలికలను విచారించడం వివాదాస్పదమైంది. ఈ చర్యను విద్యార్థి సంఘాలు నిరసించాయి. గాంధీబొమ్మ వద్దకు చేరుకొని బాపూజీ పాదాల చెంత తమ డిమాండ్లను వుంచి వినూత్న నిరసన తెలిపాయి. మొత్తం మీద విఆర్ కళాశాలకు పరిమితమైన అసభ్యకర ప్రవర్తన బియిడి కళాశాలకు చేరడం విచారకరం.

## పార్టీల పల్లెబాట

### గ్రామాల్లో సందడే సందడి

వివిధ రాజకీయ పార్టీలు పల్లెబాట పట్టాయి. ప్రజాసమస్యల పరిష్కారం కోసం ప్రభుత్వ వ్యతిరేక విధానాలపై చైతన్యవంతం చేసేందుకని నేతలు, పార్టీలు ప్రకటిస్తున్నా ఓట్ల కోసమే ఈ పాట్లన్న సంగతి జగమెరిగిన సత్యం. రకరకాల ఫీట్లతో ప్రజలను ఆకట్టుకొనేందుకు అన్ని పార్టీలు ఏదో ఒక కార్యక్రమాలకు శ్రీకారం చుట్టాయి. జాతీయ పార్టీయైన బిజెపి 'పల్లెగడప' పేరుతో గ్రామాల్లో తిరుగుతూ జిల్లాలో తిరిగి పార్టీకి జవసత్వాలు నింపేందుకు ప్రయత్నిస్తున్నది. అందుకోసం దళితవాడల్లో రాత్రి బసచేస్తూ వారి ఇళ్లలో భోంచేస్తూ దళితులకు దగ్గరయ్యేందుకు పలు రకాల కార్యక్రమాలు చేపడుతుంది. తెలుగుదేశం పార్టీని పటిష్ట పరిచేందుకు, కార్యకర్తల్లో ఉత్సాహం నింపేందుకు 'పల్లె పల్లెకు టిడిపి' పేరుతో నేతలందరూ పల్లెబాట పడుతున్నారు. ఈ రెండు పార్టీలే కాకుండా సిపిఎం పేదలకు ఇళ్ల స్థలాలు, గృహవసతి ఇతరత్రా సమస్యలపై ఏదో ఒక కార్యక్రమం పేరుతో ప్రజల ముందుకు వెళ్తూనే వుంది. లోక్‌సత్తా సైతం ప్రజాచైతన్య కార్యక్రమాలు నిర్వహిస్తూ వుంది. ఇక అధికార కాంగ్రెస్ పార్టీకి సంబంధించి జగన్ ఓదార్పు యాత్ర జిల్లాలో కలకలం రేపుతుంది. పలు గ్రామాల్లో యువకులు ఈ యాత్ర పట్ల మోజు చూపుతుండడంతో వైఎస్ విగ్రహాల ఏర్పాటుతో బిజీబిజీగా వున్నారు. పార్టీలన్నీ ఒక్కసారిగా పల్లెలకు పరుగులు పెడుతుండడంతో సందడి నెలకొనింది.

# గాంధీ ఇంటపుట్టిన మార్క్స్ - రాహుల్‌గాంధీ!

**● ఆయన వ్యవహారశైలిని దేశమే కాదు యావత్ ప్రపంచం ఆసక్తిగా చూస్తోంది.**



రాహుల్ గాంధీ రాజకీయాలలోకి వచ్చి ఆరేళ్లు కావస్తున్నది. రాజీవ్‌గాంధీ కుమారుడిగా తప్ప ఆయనకు ఇప్పటివరకు పెద్దగా గుర్తింపు, గౌరవాలు లేవు. లోక్‌సభలో ఆయన చేసిన తొలి ప్రసంగం దేశ ప్రజానీకాన్ని చాలా నిరుత్సాహ పరచింది. మహారాష్ట్రలో ఒక పేద మహిళ కథను సభ దృష్టికి తేవడానికి ఆయన చేసిన ప్రయత్నం నవ్వుల పాలైంది. అప్పటి నుంచి కాంగ్రెస్‌వాదులు కూడా రాహుల్‌గాంధీ పట్ల పెద్దగా ఆశలు పెట్టుకోలేదు. భావితరం నేతగా గుర్తించలేదు.

కానీ అదే రాహుల్‌గాంధీని ఇప్పుడు మన దేశమే కాదు, యావత్ ప్రపంచం దాచుకోలేని కుతూహలంతో ఆసక్తిగా గమనిస్తున్నది. భారత రాజకీయాలలో ఆయనొక ఉదయభానుడిగా ప్రకాశించడం తథ్యమన్న విశ్వాసం పెంచుకొంటున్నది.

ఈ ఆరేళ్లలో రాహుల్‌గాంధీ ఒక వ్యక్తిగా, ఒక నేతగా, ఒక సామాజిక శాస్త్రవేత్తగా, ఒక సత్యాన్వేషిగా, ఒక విప్లవకారుడిగా, ఒక పేద ప్రజల పక్షపాతిగా, ఒక పోరాటవీరుడిగా పరిణితి సాధించడమే అందుకు కారణం. మొన్న ఆగష్టు నెలలో ఆయన ఒరిస్సాలోని అత్యంత కరువు పీడిత ప్రాంతమైన కలహండి జిల్లాలో, నియమగిరి కొండల దిగువున ఒక సభ జరిపాడు. ఐదారువేల మంది గిరిజనులు మాత్రమే పాల్గొన్న చిన్న సభ అది. కానీ అక్కడ ఆయన చేసిన ప్రసంగం మొత్తం కార్పొరేట్ ప్రపంచానికి వెన్నులో చలి పుట్టించింది. ప్రధాని మన్మోహన్‌సింగ్ కూడా ఏదో ప్రమాదం ముంచుకవచ్చేస్తుందని వణికిపోయే పరిస్థితి కల్పించింది.

నియమగిరి కొండలలో దాదాపు 500 మిలియన్ టన్నుల బాక్సైట్ నిక్షేపాలున్నాయి. వీటి మీద ప్రపంచ కుబేరులలో ఒకరైన అనిల్ అగర్వాల్ కన్ను పడింది. మన్మోహన్‌సింగ్ సహకారంతో ఆయన వేదాంత కంపెనీ ఈ కొండను స్వంతం చేసుకొన్నది. 12వేల కోట్ల రూపాయల ఖర్చుతో అక్కడొక అల్యూమినియం కర్మాగారం నెలకొల్పింది. కానీ ఆ ప్రాంతంలోని డొంగరియ కొండులనే ఆదిమ గిరిజన జాతి ప్రజలు దాన్ని వ్యతిరేకించారు. వారి దృష్టిలో నియమగిరి ఒక కొండ కాదు. కొండ రూపంలో వున్న దేముడు. కొన్ని వేల సంవత్సరాలుగా ఆ కొండను వారు పూజిస్తున్నారు. ఆ కొండపై పెరిగిన అడవిలో పండు, ఆకు ఏరుకొని బ్రతుకుతున్నారు. వారికదే జీవనాధారం. అక్కడ బాక్సైట్ త్రవ్వాలంటే వారినక్కడ నుంచి తరిమివేయాలి. చిదంబరం ఆపరేషన్ గ్రీన్ హంట్‌లో ఇదీ ఒక భాగం. విచ్చు కత్తుల సైనిక బలగాలను పంపి గిరిజనుల నెత్తురు రుచి చూశాడు చిదంబరం.

## రాహుల్ పంథా మార్చిన గిరిజన యువకుడు

జిట్టు జకేసికా అనే గిరిజన యవకుడు రాహుల్ గాంధీని కలిసి, ఆ గిరిజనుల దీన స్థితిని వివరించాడు. ఇరవై ఏళ్లు కూడా నిండని ఆ అమాయక యువకుడి మాటలలోని ఆవేదన రాహుల్ గాంధీ హృదయాన్ని కదిలించి వేసింది. నేరుగా నియమగిరి వెళ్లాడు. కళ్లారా పరిస్థితి చూశాడు. అంతే, మీ కోసం నేను ఢిల్లీలో ఒక సైనికుడి వలె పని చేస్తానని మాట ఇచ్చాడు మన్మోహన్‌సింగ్ అభీష్టానికి విరుద్ధంగా వేదాంత కంపెనీకి ఇచ్చిన బాక్సైట్ మైనింగ్ లైసెన్స్‌ను రద్దు చేయించాడు. ఆ విజయోత్సవాన్ని ఆ గిరిజనులతో కలిసి పంచుకోవడం కోసమే ఈ చిన్న సభ జరిపాడు. ఈ పరిణామం ప్రభావం ఒక్క వేదాంత లైసెన్స్ రద్దుతో ఆగలేదు. దేశం మొత్తం మీద అటవీ ప్రాంతాలలో వున్న అన్నిరకాల గనుల కేటాయింపును సమూలంగా మార్చి వేసే కొత్త చట్టానికి ఆ సంఘటన ఒక ప్రేరణ అయ్యింది. అభివృద్ధి పేరిట, పరిశ్రమల పేరిట గిరిజనుల జీవితాలను చిదిమి వేసే క్రూరమైన ఆర్థిక సంస్కరణల పట్ల రాహుల్‌గాంధీ యుద్ధం మొదలు పెట్టాడు. తన తల్లి సోనియాగాంధీ అధ్యక్షురాలిగా వున్న జాతీయ సలహా మండలి (నేషనల్ అడ్వయిజరీ కౌన్సిల్)లో గిరిజనుల అభివృద్ధి అనే అంశానికి అధిక ప్రాధాన్యత ఇప్పించాడు. వారి కోసం పలు చట్టాలను రూపొందిస్తున్నాడు. ఇంతకాలం గిరిజనుల, దళితుల అభివృద్ధి పేరిట అమలు జరిగిన పథకాలను, కార్యక్రమాలను ప్రశ్నిస్తున్నాడు. నిజంగా మీరు చేపట్టిన ఆర్థిక సంస్కరణలు ప్రజల జీవన ప్రమాణాలు మెరుగుపరిచే పనైతే, గ్రామాలలోని దళితులు, గిరిజనులు, బలహీన వర్గాల ప్రజలు నిరక్షరాస్యులుగా, ఇళ్లు వాకిలి లేని దీనులుగా, కూలీకి వెళ్తే తప్ప పూటగడవని దౌర్భాగ్యులుగా, ప్రాణం మీదకు వచ్చినా ఆస్పత్రులకు వెళ్లలేని నిర్భాగ్యులుగా ఎందుకు వున్నారని నేరుగా ప్రధానమంత్రినే ప్రశ్నించాడు రాహుల్ గాంధీ. ఆ ప్రశ్నకు ఒక్క మన్మోహన్ సింగ్ వద్దనే కాదు, ఈ దేశంలోని ఏ వున్నత స్థానంలో వున్న వ్యక్తి దగ్గరా సమాధానం లేదు. పేద ప్రజల బ్రతుకులలో కనీసపాటి మెరుగుదల కూడా సాధించలేని మీ ఆర్థిక సంస్కరణలు మాకు వద్దని కుండబ్రద్దలు కొట్టినట్లు చెప్పేస్తున్నాడు రాహుల్ గాంధీ.

నెహ్రూ, ఇందిరమ్మల కాలంలో ఆచరణలో వుండిన సామ్యవాద పోకడలు, ఆధునిక సామాజిక అవసరాలకు, పరిస్థితులకు తగినట్లుగా మళ్లీ ప్రవేశపెట్టేందుకు ఒక బృహత్తర ప్రయత్నం ఆరంభించాడు రాహుల్‌గాంధీ. ఆయన ఆలోచనా ధోరణులు చూసిన వారికి గాంధీ ఇంట ఒక కారల్ మార్క్స్ పుట్టాడన్న భావన కల్గుతున్నది.

రాజకీయాలలో వాగ్దానాలు ఒక అంతర్భాగం. వాగ్దానం చేయడమంటే రాజకీయవాదికి మంచినీళ్ల మర్యాద. పంచాయితీ సర్పంచ్ నుంచి ప్రధాన మంత్రి వరకు అదొక సంస్కృతి. ఈ దుష్ట సాంప్రదాయాన్ని భగ్నం చేయడానికి చిత్తశుద్ధితో కూడిన ప్రయత్నం చేస్తున్నందువల్లనే రాహుల్‌గాంధీ పట్ల ప్రపంచం ఆసక్తి పెంచుకొంటున్నది. తాను ఏదో చేస్తానని ఆయన ఎక్కడా చెప్పడం లేదు. కానీ చేయదలచుకొన్న ప్రతి పనీ నిశ్శబ్దంగా చేసి పారేస్తున్నాడు. ఇంతకాలం ఏ ప్రభుత్వమైనా, నేత అయినా తన మదిలో మెదలే ఆలోచనలను విధానాలుగా, పథకాలుగా మాత్రమే అమలు చేస్తూ వస్తున్నారు. కానీ రాహుల్‌గాంధీ అందుకు భిన్నంగా తన ఆలోచనలకు చట్టరూపం కల్పిస్తున్నాడు. పథకాలైతే ప్రభుత్వం మారినప్పుడు మూలపడి పోతాయి. ఇందిరమ్మ 20 సూత్రాల ఆర్థిక పథకానికి కూడా అదే దుర్గతి పట్టిన సంగతి మరచి పోకూడదు. ఎన్టీఆర్, వైఎస్. రాజశేఖర్‌రెడ్డి వంటి నేతలు ప్రవేశపెట్టిన ఎన్నో పథకాలు ఇట్లనే కాలగర్భంలో కలిసిపోయాయి. ఈ నిజాన్ని సమగ్రంగా గ్రహించిన రాహుల్‌గాంధీ, ప్రతి ఆలోచనకు చట్ట రూపంలో కార్యాచరణ సిద్ధం చేస్తున్నాడు. ఒకసారి చట్టం చేస్తే ఆ తర్వాత ఏ ప్రభుత్వం వచ్చినా దాన్ని అమలు చేసి తీరాలి కదా? ఆయన తలపులలో పుట్టిన చట్టాల విశిష్టతను ఇదే పేజీలో వేరుగా వివరించి చెప్పడం జరిగింది. చదవండి.

## నాలుగు కొత్త మంత్రిత్వ శాఖలు

రాహుల్‌గాంధీ ప్రవేశపెట్టిన, పెడుతున్న మరొక విప్లవాత్మక మార్పు, తాను ప్రజల సంక్షేమం కోసం తల పెట్టిన కార్యక్రమాలు, చట్టాల అమలు కోసం కేంద్ర మంత్రివర్గంలో నూతన శాఖలను సృష్టించడం. రేపు నవంబర్ నెలలో జరిగే మంత్రివర్గ విస్తరణలోనే ఈ కొత్త శాఖలు ఆచరణలో వస్తాయని చెప్తున్నారు. రైట్ టు ఫుడ్, రైట్ టు ఎడ్యుకేషన్, రైట్ టు ఎంప్లాయిమెంట్, రైట్ టు హెల్త్ అనే నాలుగు కొత్త చట్టాలకు నాలుగు క్యాబినెట్ మంత్రి పదవులు సృష్టించబోతున్నాడు రాహుల్ గాంధీ. డిఫెన్స్, ఆర్థిక, హోం, విదేశాంగ వ్యవహారాల శాఖల తర్వాత వీటికే ప్రాధాన్యత ఇవ్వాలని, అనుభవజ్ఞులైన సీనియర్లను వాటికి మంత్రులుగా నియమించాలని పట్టుబడుతున్నాడట రాహుల్ గాంధీ.

మొత్తానికి ప్రభుత్వ నిర్వహణలో రాహుల్ గాంధీ తెస్తున్న మార్పులు, చేస్తున్న సవరణలు, చేయిస్తున్న చట్టాలు కాంగ్రెస్ పార్టీని విప్లవపథంలోకి నడిపిస్తున్నాయి. ఇంతకాలం మన్మోహన్‌సింగ్ ఆర్థిక సంస్క

కొరవ 14వ పేజీలో

## చెప్పే ప్రతి మాటకూ ఒక చట్టం!

రాహుల్, సోనియా గాంధీల మనోపథం నుంచి గత ఐదేళ్లలో చాలా చట్టాలు పురుడు పోసుకొన్నాయి. ప్రభుత్వాలు తమ నిత్య దినచర్యలో భాగంగా, మొక్కుబడిగా చేసే చట్టాలు కావివి. పరిపాలనలో ప్రజా సంక్షేమాన్ని రంగరించాలనే ఆర్తితో, ఆత్రుతతో, ప్రజల జీవితాలలో నిజమైన మార్పు తేవాలనే ఆర్ధ్రతతో, పట్టుదలతో చేస్తున్న విప్లవాత్మక ప్రయత్నాలు. వారిద్దరూ కలిసి చేసిన ఒక్కొక్క చట్టం, జన జీవనానికి వెలిగించిన కొత్త వెలుగు దివ్వెతో సమానం. ఈ చట్టాలన్నిటినీ చిత్తశుద్ధితో అమలు చేస్తే భారతీయ సమాజం ప్రపంచం నివ్వెరపోయే రీతిలో పురోగమిస్తుందనడంలో అతిశయోక్తి ఏమీ లేదు. వాటిలో కొన్ని ఇవీ....

1. సమాచార హక్కు చట్టం.
2. గనుల నియంత్రణ చట్టం.
3. ప్రాధమిక విద్యా హక్కు చట్టం.
4. ఆహార హక్కు చట్టం.
5. ఆరోగ్య హక్కు చట్టం.
6. ఉపాధి హామీ చట్టం.
7. అటవీ హక్కు చట్టం.
8. భూ సేకరణ చట్టం.

విప్లవాన్ని స్వప్నంలో మాత్రమే దర్శించే మావోయిస్టులు, సామ్యవాదాన్ని సిద్ధాంత పుస్తకాలకు మాత్రమే పరిమితం చేసే కమ్యూనిస్టులు కూడా ఈ చట్టాలను చూసి బిత్తర పోతున్నారు. ప్రజానీకం మనుగడపై ఇవి చూపబోయే ప్రభావాన్ని అంచనా కట్టలేక ఆశ్చర్యపడుతున్నారు.



నెల్లూరులో సృజన సాహిత్య సాంస్కృతిక వేదిక నేతృత్వంలో జరిగిన ఉత్తమ కథా సంపుటి పురస్కారాన్ని రచయిత డాక్టర్ మల్లెమాల వేణుగోపాలరెడ్డికి అందిస్తున్న సిటీ ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి. ప్రక్కన రాధాకృష్ణ, ఆర్వీ శేషయ్య నాయుడు, లతీఫ్ కుట్టి, మురళీమోహన్‌రాజు.




గాంధీ జయంతిని పురస్కరించుకొని నెల్లూరు రోటరీ క్లబ్ నిర్వహించిన ఉచిత కంటి వైద్య శిబిరంలో పరీక్షలు చేస్తున్న డాక్టర్ ఆర్వీ సుబ్రహ్మణ్యం. ప్రక్కన రొటేరియన్‌లు నారపశెట్టి నారాయణ, రామకృష్ణారావు, రమణమూర్తి.



గాంధీ జయంతిని పురస్కరించుకొని నెల్లూరు ఇందిరాభవన్‌లో జాతిపిత చిత్రపటానికి పూలమాల వేసి నివాళులర్పిస్తున్న రఘురామ్, చెంచలబాబు యాదవ్, అరుణమ్మ, వెంకట్రావ్ యాదవ్, బాలసుధాకర్ తదితరులు.

# వాళ్లు అభివృద్ధి నిరోధకులు!



● తెలుగు నేతలను తప్పు పట్టిన ఆదాల

జిల్లాలో వివిధ ప్రాజెక్టుల నిర్మాణంలో అభివృద్ధి జరుగుతుంటే తెలుగుదేశం పార్టీ ఆ అభివృద్ధిని అడ్డుకొనేందుకు దుష్ప్రచారం చేస్తున్నదని సర్వేపల్లి శాసన సభ్యులు ఆదాల ప్రభాకర్‌రెడ్డి విమర్శించారు. ఆయనకు థర్మల్ ప్రాజెక్టులపై మాట్లాడే అర్హత లేదని పరోక్షంగా సోమిరెడ్డి చంద్ర మోహన్‌రెడ్డిని ఉద్దేశించి వ్యాఖ్యానించారు. ముత్తుకూరు తహ శీల్దార్ కార్యాలయం వద్ద రిలయన్సు విద్యుత్ ప్రాజెక్టు యాష్ పాండ్ పైపు లైన్ల కోసం సేకరించిన భూములకు సంబం ధించిన రైతులకు పరిహారాన్ని అందజేశారు. ఈ సందర్భంగా ఆదాల పలు అంశాలపై తనదైన శైలిలో మాట్లా డారు. తీరప్రాంతాల్లో నిర్మితమవుతున్న థర్మల్ విద్యుత్ కేంద్రాల వలన అభివృద్ధి జరగడంతోపాటు, స్థానికు లకు ఉద్యోగావకాశాలు లభిస్తాయన్నారు. తమ హయాంలో ఎలాంటి అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టలేని కొందరు తెలుగు దేశం నేతలు స్వార్థంతో థర్మల్ ప్రాజెక్టులకు వ్యతిరేకంగా మాట్లాడుతున్నారని వ్యాఖ్యానించారు.

# హైవేపై దొంగల ముఠా!

### తిప్పవాసులపైనే అనుమానం

దగదర్తి మండలం ఐదవ నెంబర్ జాతీయ రహ దారిపై దొంగతనాలు తిరిగి జోరందుకొన్నాయి. గత కొంతకాలంగా దొంగతనాలు తగ్గుముఖం పట్టి వున్నాయి. తిరిగి ఇవి పెచ్చుమీరడంతో లారీడ్రైవర్లు, ఇతర వాహనాలపై వెళ్లే వారు హడలిపోతున్నారు. ఇటీవల దామవరం టోల్ ప్లాజా సమీపంలో లారీడ్రైవర్ నుంచి ఆరు వేల రూపాయల నగదు, సెల్‌ఫోన్ దోచుకొన్నారు. ఇలాంటి ఘటనలు రోజూ ఏదో ఒక ప్రాంతంలో జరుగుతూ వుండడంతో లారీ డ్రైవర్లు భయభ్రాం తులకు గురౌతున్నారు. ఇందుకోసం ఒక ముఠా పరిసర ప్రాంతాల్లో సంచరిస్తూ దోపిడీకి పాల్పడుతున్నట్లు సమాచారం. ఈ ముఠాలో కొందరు మహిళలు వున్నారట. వీరు రోడ్లపై నిలబడి రాత్రివేళల్లో తిరిగే లారీలను ఆపుతారు. మహిళలను చూసి లారీని ఆపిన వెంటనే ప్రక్కన పొదల్లో దాగి వుండే దొంగల ముఠా వీరిని నిలుపుదోపిడీ చేస్తుండడంతో ఈ ప్రాం తంలో ప్రయాణించాలంటేనే వణికి పోతున్నారు. ముఖ్యంగా అల్లూరురోడ్డు, పులవపాడు, దామవరం రోడ్డు, సున్నపుబట్టి, కమ్మపాళెం రహదారిపై అధికంగా జరుగుతున్నాయి. పోలీసులు నిద్రమేల్కొని హైవే పెట్రోలింగ్‌ను ముమ్మరం చేస్తే ఇవి తగ్గు ముఖం పడతాయి.

# క్రొత్త గ్యాస్ కనెక్షన్లు

కలువాయి మండలానికి దీపం పథకం క్రింద 152 గ్యాస్ కనెక్షన్లు మంజూరైనట్లు ఎమ్పీడిఓ యునైశీ తెలిపారు. దీనికి సంబంధించి లబ్దిదారుల జాబితా డిఆర్‌డిఏ నుంచి మండలానికి రావాల్సి వుందన్నారు. జాబితా అందగానే ఎంపికైన లబ్దిదారులకు గ్యాస్ కనెక్షన్లు పంపిణీ చేస్తామని ఆమె చెప్పారు.

# ఆలనా పాలనా లేని పార్కు

వెంకటగిరి పోలీసు బెటాలియన్‌లో పరిస్థితిది.

వెంకటగిరి పోలీస్ బెటాలియన్‌లో పిల్లల కోసం ఏర్పాటుచేసిన పార్కు ఆలనాపాలనా కరువై రూపుకోల్పోయింది. 1996లో అప్పటి ఐజిగా వున్న ఎకె.ఖాన్ ఈ పార్కును ప్రారంభించారు. ఆనాటి నుంచి దీని అభివృద్ధిని ఎవ్వరూ పట్టించుకోకపోవడంతో పిచ్చిమొక్కలు, ముళ్లపొదలతో అధ్వాన్నంగా తయారైంది. పిల్లలు వ్యాయామం చేసేందుకు, ఆట లాడుకొనేందుకు ఏర్పాటుచేసిన పరికరాలు తుప్పుపట్టి నిరుప యోగంగా మారాయి. త్రాగునీటి కోసం ఏర్పాటుచేసిన బోరు పనిచేయడం లేదు. గతంలో నాలుగు కంపెనీల బలగాలు వుండగా, ఇప్పుడు వాటిని ఏడు కంపెనీలకు పెంచారు. ఈ పరిస్థితుల్లో పిల్లల ఆహ్లాదం కోసం ఏర్పాటుచేసిన పార్కు బాగోగులు పట్టించుకోవడంతోపాటు, బెటాలియన్ నుంచి వెంకటగిరి వెళ్లే వల్లివేడు రహదారిని అభివృద్ధి చేయాలని స్థానిక పోలీసు కుటుంబాలు కోరుకొంటున్నాయి.

# కావలి కాంట్రాక్టర్లు ఆడిందే ఆట - పాడిందే పాట!

● అధ్వాన్నంగా వేసిన రోడ్లు

కావలి పట్టణంలో కాంట్రాక్టర్లది ఆడింది ఆటగా మారింది. మునిసిపాలిటీ పాలకవర్గం సెప్టెం బర్ 29తేదికి రద్దయిపోయింది. దీనిని ముందుగానే గమ నించిన కాంట్రాక్టర్లు పాలకవర్గం గడువు ముగిసేలోగా తమ పనులు చక్కబెట్టుకొనేందుకు హడావిడిగా నిర్మించిన రోడ్లు పరమ అధ్వాన్నంగా వున్నాయి. నాణ్యతకు తిలోదాకాలు ఇవ్వడమే కాకుండా రోడ్డుకు ఇరువైపులా డ్రయిన్లు ఏర్పాటు చేయకుండా నిర్మించడం వలన మురుగునీరు పోయే మార్గం లేక ఇళ్లలోకి వస్తుండడంతో ప్రజలు అల్లాడిపోతున్నారు. ఇస్లాంపేటలో ఇళ్లలోకి మురుగునీరు వచ్చేస్తుంది. రెండు లక్షల రూపాయల అంచనా వ్యయంతో రోడ్డు నిర్మించినప్ప టికీ డ్రయిన్లు నిర్మించని కారణంగానే ఈ సమస్య. కావలి పట్టణ వాసులను వేధిస్తున్నది. దీనిపై పలుమార్లు ఫిర్యాదు చేసినప్పటికీ కాంట్రాక్టర్లకు మాత్రం బిల్లుల చెల్లింపు జరిగి పోయింది. ఈ విషయమై ఉన్నతాధికారులు విచారణ జరిపి రోడ్ల నిర్మాణంలో జరిగిన అవకతవకలను సరిదిద్దాల్సి వుంది.

# అల్లూరులో భూకుంభకోణం!

### ఎమ్మార్వో ఆఫీసులో రికార్డులు పరిశీలించిన జెసి

అల్లూరు మండలంలో కళాకారులకు కేటాయించిన భూమిని కొందరు రెవెన్యూ సిబ్బంది భూస్వాములతో కుమ్మక్కై అక్రమాలకు పాల్పడ్డారని వచ్చిన ఫిర్యాదుపై జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్ రెవెన్యూ కార్యాలయాన్ని తనిఖీ చేశారు. సర్వే నెంబర్ 239లో గల భూమిని కొందరు పేద కళాకారులకు కేటాయించింది ప్రభుత్వం. మొత్తం 3052 ఎకరాలకుగాను 100 ఎకరాలు రికార్డుల్లో నమోదు కాకపోవడంపై ఆయన ఆరా తీశారు. విఆర్ఓ, రెవెన్యూ అధికారులను ఎవరిని అడిగినా వారు సరైన సమాధానం చెప్పలేకపోవడంతో జెసి మండిపడ్డారు. రేషన్ కార్డుల పంపిణీ, ఇళ్ల స్థలాలు, భూముల కబ్జాలపై ఫిర్యాదులు వెల్లువెత్తుతుండడంతో తనిఖీకి వచ్చిన సౌరభ్ గౌర్ అధికారుల పనితీరుపై అసంతృప్తి వ్యక్తం చేశారు. మొత్తం రికార్డులన్నింటిని తన కార్యాలయానికి తీసుకొని రావలసినదిగా ఆదేశించారు.




నెల్లూరులో కేంద్రీయ విద్యాలయం ప్రారంభించి సభలో మాట్లాడుతున్న జిల్లా కలెక్టర్ రాంగోపాల్. వేదికపై ఎమ్పీ రాజమోహన్‌రెడ్డి, మంత్రి రామనారాయణరెడ్డి, ఎమ్మెల్సీ విఠపు బాలసుబ్రహ్మణ్యం, సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి.

# మృత్యుమలుపు!

## గౌరవరం దగ్గర 136 ప్రమాదాలు

జాతీయ రహదారితో కావలి మండలం గౌరవరం వద్ద గల సమస్యాత్మక స్థలం కారణంగా 11 మీటర్ల మేర రోడ్డు మలుపు తీసుకొని ఒకే మార్గంలో వెళ్లాల్సి వుండడంతో నిత్యం వాహనాలు ప్రమాదాలకు గురౌతున్నాయి. ఈ కొద్ది మార్గంలో ఇప్పటివరకు 143 యాక్సిడెంట్లు జరుగగా, 36మంది మృత్యువాత పడ్డారు. 140 మందికిపైగా క్షత గాత్రులయ్యారు. నేషనల్ హైవే అధికారుల నిర్లక్ష్యం, మొండి వైఖరి కారణంగానే ఈ ప్రమాదాలు జరుగుతున్నాయని పలు వురు వ్యాఖ్యానిస్తున్నారు. జాతీయ రహదారికి పడమర భాగంలో రోడ్డు విస్తరణ సమయంలో అక్కడ నివాసం వుండే కుటుంబాలు, అధికారులకు మధ్య పరిహారం విషయమై వివాదం తలెత్తింది. అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరించి రోడ్డును తమ నివాస ప్రాంతంలో నిర్మించారంటూ కొందరు కోర్టును ఆశ్రయించారు. దీంతో న్యాయస్థానం పరిహారం చెల్లించేంత వరకు రోడ్డును వినియోగించరాదని ఉత్తర్వులు ఇచ్చింది. దీంతో ఆ కొద్దిదూరం ఒకే మార్గంలో వాహనాలు తిరగాల్సి రావడంతో ప్రమాదాలు జరుగుతున్నాయి. ఈ సమస్య పరిష్కారం కోసం కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు ఇటీవల గౌరవరం వాసులతో ఒక సమావేశం ఏర్పాటు చేశారు. కానీ గ్రామస్తులు ఈ సమావేశానికి రాకుండా డుమ్మా కొట్టారు.



ఎందరి ప్రాణాలో బలిగొన్న మలుపు.

# కృష్ణపట్నం పోర్టు మొబైల్ ఆస్పత్రి!

కృష్ణపట్నం పోర్టు యాజమాన్యం చుట్టుప్రక్కల ప్రాంతాల ప్రజలకు వైద్య సహాయం కోసం 35 లక్షల రూపాయలు వెచ్చించి మొబైల్ ఆస్పత్రిని ఏర్పాటు చేసింది. నూతనంగా ఏర్పాటుచేసిన ఈ మొబైల్ ఆస్పత్రిని స్థానిక వేణు గోపాలస్వామి ఆలయం వద్ద పోర్టు విఆర్‌ఓ వేణుగోపాల్, సిఇఓ అనిల్‌కుమార్‌లు ప్రారంభించారు. వాళ్లు మాట్లాడుతూ ఏసి సౌకర్యం గల ఈ వ్యాను ఒక మినీ ఆస్పత్రి

## 35 లక్షలు వెచ్చించిన యాజమాన్యం

వంటిదని, రోగులకు అత్యవసర వైద్య సేవలు అందించేందుకు అవసరమైన అన్ని సౌకర్యాలు అందుబాటులో వున్నాయన్నారు. టోల్ ఫ్రీ నెంబర్లు కేటాయిస్తున్నామని, అవసరమైన వారు ఈ నెంబర్లకు ఫోన్ చేసినట్లయితే ఆయా ప్రాంతాలకు ఈ వ్యాన్ వెళ్లి వైద్యాన్ని అందిస్తుందని తెలిపారు. ఈ కార్యక్రమంలో పోర్టు సిబ్బంది భవానీ ప్రసాద్, వైద్యులు, సర్పంచ్ వెంకటరత్నం, రాగాల వెంకటేశ్వర్లు, కోదండ రామయ్య తదితరులు పాల్గొన్నారు.

# ఇందిరమ్మ ఇళ్లు ఎప్పుడు?

## వెంకటగిరిలో స్థలాల కేటాయింపులో జాప్యం!

వెంకటగిరిలో ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణాల్లో జాప్యం చోటు చేసుకొంటుంది. మొదటి, రెండవ విడత ఇళ్ల నిర్మాణాలు జరిగినప్పటికీ, మూడోవిడత ఇంది రమ్మ ఇళ్లకు స్థల సేకరణ అడ్డంకిగా మారింది. పట్టణ పరిధి లోని 3, 5, 6, 13, 18, 19 వార్డుల్లో 791 లబ్దిదారులకు స్థల సమస్యతో పేదలకు సొంతింటి కల నెరవేరకుండా పోయింది. మొగళ్లగుంట వద్ద 26 ఎకరాల స్థలాన్ని ఎంపిక చేశారు అధికారులు. ఎకరాకు లక్ష రూపాయల చొప్పున పరి హారం చెల్లించదలచారు. దీనికి భూముల యజమానులు ఒప్పు కోకపోవడంతో పెండింగ్ పడింది. లబ్దిదారుల జాబితా తయారై ఏడాది గడిచినా స్థల కేటా యింపు జరగక పోవడంతో ఆ వార్డుల్లోని కౌన్సిలర్లు స్థలాల పంపిణీ చేయకుండానే పాలకవర్గం కాలపరిమితి ముగియ డంతో ప్రజల్లో తిరగాలంటేనే ఇబ్బంది పడుతున్నారు. అధికా రుల ఆలసత్వం కారణంగా తమకు తిప్పలు వచ్చిపడ్డాయని కౌన్సిలర్లు ఆవేదన చెందుతున్నారు. తిరిగి ఏ ముఖం పెట్టు కొని రేపటి ఎన్నికలలో ప్రజల వద్దకు వెళ్లాలని మల్లగుల్లాలు పడుతున్నారు.

## రేషన్‌కై బీరంగుంట వాసుల ఆందోళన

అల్లూరు మండలంలోని బీరంగుంట గ్రామస్తులు రేషన్ సరుకుల కోసం ఆందో ళన చేపట్టారు. అరుంధతీయవాడకు చెందిన ప్రజలు తమకు సక్రమంగా రేషన్ అందడం లేదని, సమాధానం చెప్పకుండా ఇబ్బందులకు గురిచేస్తున్నారంటూ వాపోతున్నారు. డీలర్ తనకు ఇష్టం వచ్చినప్పుడు ఇస్తూ, మిగతా సమయాల్లో షాపు తెరవకుండాపోతుండ డంతో ప్రభుత్వం అందించే బియ్యం, కిరోసిన్ ఇతరత్రా వస్తువులు అందకుండా కుటుంబ జీవనం కష్టంగా మారిందని స్థానికులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఇప్పటికైనా అధికా రులు స్పందించి సక్రమంగా రేషన్ అందేలా చూడాలని కోరుకొంటున్నారు.

# బోగోలును వణికిస్తున్న జ్వరాలు!

## రోగులతో కిటకిటలాడుతున్న కావలి ఆస్పత్రులు



జ్వరబాధితులను పరామర్శిస్తున్న వైద్యాధికారిణి సౌజన్య.

బోగోలు మండలాన్ని విషజ్వరాలు చుట్టుముట్టాయి. అన్ని పంచాయితీలు జ్వరాలతో వణికిపోతున్నాయి. ప్రతి కుటుంబంలోనూ ఇద్దరు, ముగ్గురు డెంగ్యూ, వైరల్ జ్వరాలతో మంచం పట్టి వున్నారు. కడనూతల, నాగులవరం, కొండ బిట్రగుంట, కోవూరుపల్లి గ్రామాల్లో అధికశాతం ప్రజలు వ్యాధిగ్రస్తులై ఆస్పత్రుల్లో చికిత్స పొందుతున్నారు. కావలి ప్రభుత్వ ఆస్పత్రి జ్వరాల బారినపడిన రోగులతో కిటకిటలాడుతోంది. అల్లిమడుగులో 30 మందికిపైగా వ్యాధిగ్రస్తులు కావడంతో సమాచారం అందుకొన్న కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు బోగోలు ఆస్పత్రిని సంద ర్శించి పరిస్థితిని సమీక్షించారు. కావలి ఆస్పత్రికి రోగులను తరలించడానికి వాహన సదుపాయం లేదని తెలుసుకున్న మస్తాన్‌రావు సొంత వాహనంలో జ్వరపీడితులను ఆస్పత్రికి తరలించి, ఇతరత్రా వైద్యఖర్చుల కోసం 25వేల రూపాయల నగదును అందించి తన దాతృత్వాన్ని, సేవానిరతిని చాటుకొన్నారు.

## 'బాబు'పై 'ముద్దు' స్తోత్రం



ఏ పార్టీలో వుంటే ఆపార్టీ నాయకుల్ని ఆకాశానికి ఎత్తడం గాలి ముద్దుకృష్ణమనాయుడికి మైకుతో పెట్టిన విద్య. కాంగ్రెస్‌లో వున్నప్పుడు వైఎస్‌ను చెట్టెక్కించాడు. వైఎస్ మెప్పుకోసం చంద్రబాబును తిట్టిన తిట్టు తిట్టకుండా ఉతికి ఆరేశాడు. అయితే రాజకీయాల్లో ఏదైనా సాధ్యమే అన్నట్లు రికార్డు తిరగబడి గాలి ముద్దు మళ్లీ 'బాబు' నీడకు చేరాడు. తెలుగుదేశం తరపున పోటీ చేసి ఎమ్మెల్యే అయ్యాడు. అప్పట్లో వైఎస్‌ను పొగిడిన నోటితోనే నానా చండాలంగా వైఎస్‌ను, జగన్‌ను తిట్టి పోస్తున్నాడు. మరో అడుగు ముందుకేసి చంద్రబాబుకు సిఎం కుర్చీ చిన్నదైపోయిందని, ఆయన ప్రధాని కావాలంటూ కొత్త స్లోగన్ అందుకున్నాడు. దేశం నానాటికీ దిగజారిపోతోందట. దీన్ని బాగు చేయాలంటే 'బాబు' ప్రధాని కావల్సిందేనని 'ముద్దు'గా చెబుతున్నాడు. తిట్టినా, పొగిడినా గాలి ముద్దుకే చెల్లిందంటూ తెలుగు తమ్ముళ్లు చెవులు కొరుక్కుంటున్నారట!ప్చ్!!

## అయినను పోయిరావలె 'హస్తినకు'



రోశయ్య ఢిల్లీ యాత్ర రాజధానిలో హాట్ టాపిక్‌గా మారింది. రోశయ్య ఢిల్లీకి వెళ్తే ఈసారైనా మంత్రివర్గ విస్తరణ జరుగుతుందా! లేదా అన్న దానిపై కాంగ్రెస్ వర్గాలు మల్లగుల్లాలు పడుతున్నాయి. రాష్ట్రంలో ఏ సమస్య వచ్చినా తనస్థాయిలో పరిష్కరించాల్సింది పోయి అంతా అధిష్టానమే చూసుకుంటుందంటూ దాటవేయడం రోశయ్యకు మైనస్‌గా మారింది. డిసెంబర్‌లో శ్రీకృష్ణకమిటీ ప్రత్యేక తెలంగాణపై రిపోర్టు ఇస్తే తలత్తే పరిస్థితిని తట్టుకోవడం రోశయ్యకు సాధ్యం కాదన్నది అధిష్టానం అభిప్రాయంగా వుంది. దీని కోసం డిసెంబర్‌కు ముందే రోశయ్యను తప్పించి ఆ స్థానంలో మరొక సమర్థుడ్ని నియమించాలా! లేక మంత్రి వర్గాన్ని విస్తరించి తెలంగాణకు చెందిన వారిని డిప్యూటీ సిఎంగా చేసి రోశయ్యను బలోపేతుడిగా చెయ్యాలా! అన్న విషయంలో అధిష్టానం తర్జన భర్జన పడుతోంది. ఈ నేపధ్యంలో రోశయ్య ఢిల్లీ యాత్రకు ప్రాధాన్యత ఏర్పడింది. అధిష్టానం ఆలోచనను తెలుసుకున్న రోశయ్య కొన్ని రోజులుగా సచివాలయానికి కూడా సరిగా రావడం లేదు. ఏదైతే అదవుతుందన్న వేదాంత ధోరణిలో రోశయ్య రోజుల్ని గడిపేస్తున్నాడు.

## అభిమానుల అండతో 'చిరు' యాత్ర



అభిమానుల అండదండలతో తెలంగాణ ప్రాంతంలో పర్యటించాలని చిరంజీవి నిర్ణయించాడు. సమైక్యవాదంతో తెలంగాణకు వ్యతిరేకంగా వ్యవహరిస్తున్న చిరంజీవి యాత్రను అడ్డుకుంటామంటూ టిఆర్ఎస్ ప్రకటించిన నేపథ్యంలో చిరు యాత్రకు ప్రాధాన్యం ఏర్పడింది. తెలంగాణలో తన యాత్ర విఫలమైతే భంగపడాల్సి వస్తుందని చిరు అనుమానిస్తున్నాడు. అందుకే అభిమానుల్ని కూడగట్టి, వారి అండదండలతో తెలంగాణ యాత్రను విజయవంతం చేయాలని నిర్ణయించాడు. దీంతోపాటు కొత్తగా ఏర్పాటైన గద్దర్ ఫ్రంట్‌తో చేతులు కలుపుతున్నాడు. దీనివల్ల టిఆర్ఎస్ శక్తుల్ని ధీటుగా ఎదుర్కోవచ్చునది చిరంజీవి అభిప్రాయం. అభిమానుల్ని కూడగట్టే పని ఇప్పటికే ప్రారంభమైంది. గతంలో ప్రజారాజ్యానికి అభిమానుల్ని దూరంగా వుంచారు. మారిన పరిస్థితుల దృష్ట్యా యిప్పుడు వారిని పిలిచి మరీ పార్టీ పదవుల్ని అప్పజెబుతున్నాడు. సోదరుడు నాగేంద్రబాబు దీని కోసం కృషి చేస్తున్నాడు. ఇంకేం.. తెలంగాణలో పర్యటించాలన్న 'చిరు' కోరిక త్వరలో నెరవేరవచ్చు. చిరుకు బెస్ట్ ఆఫ్ లక్ చెబుదాం!

## ఈవీఎంలపై 'బాబు' బెంగ



గత ఎన్నికల్లో ఓడిన దగ్గర నుంచీ చంద్రబాబుకు ఈవీఎంల పని తీరుపై బెంగపట్టుకుంది. అధికార పక్షం ఈవీఎంలను తారుమారు చేస్తోందన్నది 'బాబు' అనుమానం. గత ఎన్నికల్లో విజయం గడపదాకా వచ్చి చేజారిపోవడానికి ఈవీఎంలే కారణమన్నది బాబు వాదన. గత రెండేళ్లుగా ఈవీఎంల వాడకంపై 'బాబు' తన వ్యతిరేకతను వ్యక్తం చేస్తూనే వున్నాడు. ఇటీవల ఉప ఎన్నికల్లో టిఆర్ఎస్ కూడా ఈవీఎంలపై అనుమానంతో లెక్కకుమించిన అభ్యర్థుల్ని రంగంలోకి దించి వీటి వాడకానికి 'చెక్' పెట్టింది. మొత్తానికి ఈవీఎంల వాడకంలో 'మతలబు' ఏదో వుందన్న అనుమానాన్ని 'బాబు' ఇతర రాజకీయపక్షాలకు కూడా వ్యాపింపజేశాడు. దీంతో జాతీయ, ప్రాంతీయ పార్టీల నాయకులందర్ని సమీకరించి ఎన్నికల సంఘానికి ఫిర్యాదు చేయించాడు. ఎన్నికల సంఘం కూడా ఈవీఎంలకు చెక్ పెట్టడానికి పరోక్షంగా అంగీకరించింది. ఈవీఎంలలో ఓటు వేసిన వారి పేర్లను ముద్రించడానికి ఏర్పాట్లు చేయడానికి అంగీకరించింది. దీంతో 'బాబు' బెంగ కొంతవరకు తీరింది. ఇక వచ్చే ఎన్నికల్లో ఫలితాలపై ఈవీఎంల మాయాజాలం తగ్గుతుందని 'బాబు' ఆశిస్తున్నాడు... శుభం!!

# విజయదశమి రోజు ఏ పని చేసినా జయమే!



శక్తి ఆరాధనకు ప్రాధాన్యత ఇచ్చే పండుగ దసరా. ఆశ్వీయుజ శుద్ధపాడ్యమి నుంచి తొమ్మిదిరోజులు దేవీ నవరాత్రులు, పదవరోజు విజయదశమిని కలిపి దసరా అంటారు. ఈ పండుగకు నవరాత్రి, శరన్నవరాత్రి అని పేరు. శరదృతువు ఆరంభంలో వచ్చే పండుగ కనుక ఈ పేరు వచ్చింది. మొదటి మూడురోజులు పార్వతి దేవిని, తరువాతి మూడు రోజులు లక్ష్మీదేవిని, చివరి మూడురోజులు సరస్వతి దేవిని పూజిస్తారు. నవరాత్రుల సందర్భంగా దుర్గామాతకు పూజలు చేస్తారు. ఈ రోజుల్లో ఒక్కో రోజు ఒక్కో అలంకరణ చేస్తారు. తెలంగాణ ప్రాంతంలో అమావాస్య నుంచి నవమి వరకు తొమ్మిదిరోజులు బతుకమ్మ ఆడతారు.

జగన్మాత అయిన దుర్గాదేవి మహిషాసురుడు అనే రాక్షసునితో తొమ్మిది రాత్రులు యుద్ధం చేసి అతన్ని వధించి విజయాన్ని పొందిన సందర్భంగా పదవరోజున విజయదశమి జరుపుకోవడం ఆనవాయితి. పూర్వం రాజులు తమ దండయాత్రలకు ఈ శుభ ముహూర్తాన్నే ఎంచుకొనేవారని పురాణాల్లో చెప్పబడింది. ఈ సందర్భంగా బొమ్మల కొలువు పెట్టే ఆచారం వుంది.

అరణ్యవాసం పూర్తి చేసుకొని అజ్ఞాత వాసం చేసే సమయంలో పాండవులు తమ ఆయుధాలను ఎవరికంటాపడకుండా జమ్మిచెట్టు మీద భద్రపరిచారు. అజ్ఞాతవాసం ముగింపులో విజయదశమినాడు పాండవ మధ్యముడైన అర్జునుడు ఆయుధాలను బయటకు తీసి పూజ చేసి ఉత్తర గోగ్రహణయుద్ధం చేసి విజయుడైనాడు. ఆశ్వీయుజ శుద్ధ దశమినాడు దుర్గాదేవి, అర్జునుడు విజయులైనారు కనుక ఆనాడు ఏ కార్యక్రమం చేపట్టినా విజయవంతం అవుతుందని భావించి ప్రజలు పూజలు చేసి పనులను ఆరంభిస్తారు. శమీవృక్ష పూజ ముఖ్యమైనది. జమ్మిచెట్టును పూజించినట్లయితే శుభం కల్గుతుందని, వృక్షరూపంలో వున్న అపరాజితా దేవి ఆశీస్సులు లభిస్తాయని ప్రతీతి. శ్రీరాముడు అపరాజితా దేవిని పూజించే రావణ సంహారం చేశాడని పురాణ కథనం.

దసరా సందర్భంగా గ్రామాల్లో విచిత్ర వేషధారణలు, పగటివేషాలు, పిట్టల దొరలు తిరుగుతూ గృహస్తులు ఇచ్చింది స్వీకరించడం చేస్తారు. పాఠశాలల్లో ఉపాధ్యాయులు, విద్యార్థులు గదులను అలంకరించి అయ్యవారికి చాలు ఐదు వరహాలు పిల్లలకు చాలు పప్పుబెల్లాలు అని పాడుకొంటూ సంతోషంగా సంబరాలు జరుపుకొంటారు. దసరా పండుగను దేశంలోని వివిధ ప్రాంతాలైన మైసూరు, కలకత్తా, ఒరిస్సాలలో ఘనంగా నిర్వహిస్తారు.

## ట్రంకురోడ్డు కబుర్లు

## మార్క్సిస్టులు మారారు!



నెల్లూరు సిపిఎం కేంద్ర, రాష్ట్ర నాయకుల పుట్టినిల్లు కావడంతో ఆ పార్టీకి ఇక్కడ ప్రత్యేక గుర్తింపు వుంది. ప్రజల కోసం ఎన్నో త్యాగాలు, పోరాటాలు చేసిన నాయక శ్రేణి ఇక్కడ వుంది. పుట్టుకరీత్యా ఆస్తిపరులైన జక్కా వెంకయ్య, డాక్టర్ శేషారెడ్డి, డాక్టర్ రమణారెడ్డి, గండవరపు బాలకృష్ణారెడ్డి, పెనుబల్లి మధు గడిపిన సాధారణ జీవనం పార్టీ కార్యకర్తలను ఆశ్చర్యపర్చేది. ఇదే ధోరణిలో నడుస్తుండిన సిపిఎం జిల్లా కార్యదర్శి టి.పి.భానురాజు తన ధోరణికి భిన్నంగా కుమారుని పెళ్లిని 30వ తేది అట్టహాసంగా చేశారు. సిపిఎం రాష్ట్ర కార్యదర్శి రాఘవులతోపాటు నెల్లూరు ఎమ్పీ, జిల్లాలోని కాంగ్రెస్, తెలుగుదేశం, చివరికి బిజెపి నాయకులు సైతం ఈ పెళ్లికి హాజరయ్యారు. ఇదంతా మామూలే అయినా జిల్లాలో మార్క్సిస్టులు బాగా మారారని ఈ పెళ్లి చాటి చెప్పిందని ట్రంకురోడ్డులో విస్తృత చర్చ జరుగుతోంది.

## రోబో ఫీవర్



రజనీకాంత్ – ఐశ్వర్య రాయ్ జంటగా నటించి, సంచలన దర్శకుడు కె.శంకర్ దర్శకత్వం వహించిన 'రోబో' చిత్రం దేశవ్యాప్తంగా విడుదలై సంచలనం సృష్టిస్తున్న విషయం తెలిసిందే. నెల్లూరులో ఈ చిత్రం ఐదు సినిమా హాళ్లలో విడుదలైనా టిక్కెట్లు మాత్రం దొరకడం లేదు. డబ్బింగ్ చిత్రమైనా 20వ తేది వరకు ఈ సినిమా టిక్కెట్లు అయిపోయాయి. టాక్ బాగుండడంతో అందరూ రోబోను చూడాలని తహతహలాడుతున్నారు. దీంతో ఈ సినిమా 50 రూపాయల టిక్కెట్ 500 రూపాయలకు అమ్ముడవుతూ ఆశ్చర్యపరుస్తోంది.

## పోలీసుల ఆట



అయోధ్య తీర్పు నేపథ్యంతో దేశవ్యాప్తంగా పోలీసులు విధుల్లో బిజీ బిజీగా వుంటే నెల్లూరు పోలీసులు మాత్రం ఆటవిడుపులో వుండినారు. ఈ వ్యవహారాన్ని తప్పుగా అర్థం చేసుకోవాల్సిన అవసరమేమీ లేదు. ముందుగా జిల్లా పోలీసుల వార్షిక క్రీడోత్సవం ఖరారు కావడంతో ఆటల ఆలోచనలో పడిపోయారు. జిల్లాలో అయోధ్య తీర్పు వ్యవహారమై ఉద్రిక్తతలు కూడా లేకపోవడంతో అన్ని స్థాయిల పోలీసులు క్రీడోత్సవంలో మునిగి తేలడం నెల్లూరీయులను ఆశ్చర్యపరిచింది.



**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

కన్ను, గొంతు, ఊపిరితిత్తులకు సంబంధించిన చిన్న చిన్న అనారోగ్య సమస్యలుంటాయి. కళత్ర సంబంధాలు చక్కగా ఉంటాయి. పిల్లల ఆకస్మిక అనారోగ్యం ఆవేదనకు గురి చేస్తుంది. విరోధులు అణగి ఉంటారు. పితృవర్గం మరియు సోదరుల నుండి సహాయ సహకారాలు అందుతాయి. నూతన ఆదాయమార్గాలు కనుచూపు మేరలో లేవు. వృత్తిపరులకు ఆదాయం బాగా ఉంటుంది.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

ఆరోగ్యం చక్కగా ఉంటుంది. కొందరికి ప్రేగులకు సంబంధించిన చిన్నచిన్న సమస్యలుండవచ్చు. సోదరుల ప్రవర్తన ఇబ్బందికరంగా ఉండవచ్చు. పిల్లల చదువు విషయం తృప్తికరంగా ఉండదు. కుటుంబ సభ్యులలో ఒకరు మీతో విరోధం పాటించవచ్చు. ఆర్థిక విషయాలు చాలా తృప్తికరంగా ఉంటాయి. కొత్త పెట్టుబడులు మంచి ప్రయోజనాన్నిస్తాయి. వ్యాపారులకు ముందు చూపు తక్కువ.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

ఆకస్మికంగా పైత్య, బి.పి.ల బాధలు ఎదురౌతాయి. దగ్గు, ఊపిరితిత్తులకు సంబంధించిన సమస్యలుండవచ్చు. బంధుమిత్రుల సమాగమం ఆనందాన్నిస్తుంది. కొత్త బాంధవ్యాలేర్పడవచ్చు. ఆర్థిక విషయాలలో నూతన ప్రయత్నాలు చేస్తారు. ఖర్చులధికంగా ఉంటాయి. వ్యాపారంలో భాగస్వామ్యపు గొడవలు తగ్గుతాయి. వృత్తిపరులు అధికంగా శ్రమించాలి. ఉద్యోగులకు మేలైన కాలం.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

జలుబు, దగ్గు తప్ప వేరే ఆనారోగ్య బాధలుండవు. కుటుంబంలో శాంతి, సంతోషాలు తాండవిస్తాయి. సోదరుల నుండి విమర్శల నెదుర్కొంటారు. వ్యాపారులకు ధనాదాయం బాగున్నా, వృత్తిపరులు పోటీలతో అధికశ్రమతో ఇబ్బందులకు గురౌతారు. ఉద్యోగులకు చాలా కాలంగా ఎదురుచూసిన డబ్బు అందుతుంది. విద్యార్థులు సరిగా చదవక ఇబ్బంది పడుతారు.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

తీవ్రమైన అనారోగ్య సమస్యలు లేకపోయినా గ్యాస్ట్రిక్ సమస్యలు, నరాలకు సంబంధించిన సమస్యలుంటాయి. కళత్ర సంబంధాలు చక్కగా ఉంటాయి. ఇంటిలో పూజా కార్యక్రమాలు నిర్వహిస్తారు. పుణ్య క్షేత్రాటనం చేసే అవకాశముంది. ఆర్థికంగా చాలా చక్కని కాలం. స్పెక్యులేషన్ లాభిస్తుంది. కొనుగోలుదారుల నాడిని సరిగా తెలుసుకొని వ్యాపారులు మంచి లాభాలను ఆర్జిస్తారు.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా

శరీరంలో జీవశక్తి తగ్గుతుంది. ఆకస్మిక ప్రమాదాలు ఎదురవవచ్చు. కుటుంబములో పెద్దలతో అవగాహనాలోపం గొడవలకు దారి తీస్తుంది. దైవం వైపు మనసు పోనివ్వడం మంచిది. ఆదాయంలో మిశ్రమ ఫలితాలుంటాయి. స్పెక్యులేషన్ జోలికి పోరాదు. భాగస్వాములు మోసగించే అవకాశాలున్నాయి. ఉద్యోగులకు కాలం సుకరంగా ఉండదు. పాత బాకీలు వసూలు కావడం కష్టం.

# వారఫలాలు

*తేది 9-10-2010 నుండి 15-10-2010 వరకు కన్యలో రవి, బుధ, శనులు; మీనంలో గురువు; తులలో శుక్ర, కుజులు; ధనుస్సులో రాహువు; మిథునంలో కేతువు; తుల, వృశ్చిక, ధనుస్సుల్లో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

15తేది దుర్గాష్టమి.

**శుభ ముహూర్తాలు**

10తేది కర్కాటకలగ్నాన రా.12.00 నుండి 1.00 వరకు

14తేది సింహలగ్నాన తె.3.00 నుండి 4.00 వరకు గంటల వరకు సుముహూర్తాలున్నాయి.

**అక్టోబర్ తిథులు**
**ఆశ్వయిజ శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 9 | శని | విదియ | సా.5.33 | గం.ల.వ |
| 10 | ఆది | తదియ | సా.3.32 | గం.ల.వ |
| 11 | సోమ | చవితి | మ.1.55 | గం.ల.వ |
| 12 | మంగళ | పంచమి | మ.1.08 | గం.ల.వ |
| 13 | బుధ | షష్ఠి | మ.1.14 | గం.ల.వ |
| 14 | గురు | సప్తమి | మ.2.09 | గం.ల.వ |
| 15 | శుక్ర | అష్టమి | సా.3.46 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com



**తుల**
చిత్తా 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

ఆరోగ్య విషయం సాధారణంగానే ఉంటుంది. బిపి రోగులు జాగ్రత్తగా ఉండాలి. కళత్ర సంబంధాలు చక్కగా ఉంటాయి. పరస్పరం అనురాగం పెంపొందుతుంది. కొత్త మిత్రుల చేరిక ఉంటుంది. ఆర్థిక విషయాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వ్యాపారులకు వృత్తిపరులకు ప్రోత్సాహకరమైన కాలం. విస్తరణకు అనుకూలమైన సమయం. విద్యార్థులు శ్రద్ధగా అధ్యయనం సాగిస్తారు.



**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జేష్ఠ

కీళ్ళ నొప్పులు, వాత సంబంధిత రోగాలు బాధిస్తాయి. కుటుంబ సభ్యులతో సంప్రదింపులు ఫలిస్తాయి. ఆర్థిక విషయాలు తృప్తికరంగా ఉంటాయి. అరువు పుచ్చుకొన్నవారు తిరిగి చెల్లిస్తారు. కోరిన తావున ఋణాలందుతాయి. వ్యాపారులు భాగస్వాముల విషయంలో జాగ్రత్తగా ఉండాలి. వృత్తిపరులు చక్కని ఆదాయాన్ని చూస్తారు. గృహిణులు వేదనకు గురౌతారు.



**ధనస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

వీరికి ఈ కాలం చాలా ఇబ్బందికరమైనది. నిద్రలేమి, జ్వరం, పాదాలకు గాయాలు బాధిస్తాయి. కుటుంబంలో కూడా చిన్న చిన్న సమస్యలుంటాయి. కళత్ర సంబంధాలు చక్కగా ఉండవు. ఆర్థిక విషయాల్లో అడ్డంకులెక్కువ. ఎదురుచూసిన డబ్బు చేతికందదు. ఖర్చులధికము. వసూళ్లు తక్కువ అవడం, ఋణదాతల ఒత్తిడి వ్యాపారులను బాధిస్తాయి. వృత్తిపరులకు అన్ని వైపుల పోటీలధికం.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

ఆరోగ్య విషయంలో చాలా చక్కగా ఉంటుంది. ఊపిరి తిత్తులకు సంబంధించి కొద్దిగా సమస్యలుండవచ్చు. ఖర్చులు అదుపులో ఉండి ఆదాయం బాగుంటుంది. పాత వస్తువులను అమ్మజూస్తారు. భాగస్వామి ద్వారా మేలు కలుగుతుంది. వ్యాపారవృద్ధికి ప్రయత్నాలు చేస్తారు. ఉద్యోగులకు ఎదురుచూసిన ఆదాయం వుంటుంది. వృత్తిపరులకు దూర దృష్టిలోపం ఇబ్బందులను కలుగజేస్తుంది.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

ఆరోగ్య సమస్యలు తీవ్రతరంగా ఉంటాయి. వివిధ రకాలైన అనారోగ్య బాధలుంటాయి. భార్యా, భర్తల నడుమ అభిప్రాయ బేధాలధికం. బంధువులతో సమస్యలు తీవ్రమౌతాయి. ఆర్థిక విషయాలు కొంతమెరుగు. అప్పులు పుడతాయి. భాగస్వామి ప్రవర్తన ఇబ్బందికరంగా ఉంటుంది. పోటీలెక్కువ. వృత్తిపరులు విస్తరణ చేస్తారు. ఉద్యోగులకు రావలసినవి అందుతాయి.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

దీర్ఘ రోగులకు ఊరట. ఆరోగ్య సమస్యలు తక్కువ. కుటుంబ సభ్యుల మధ్య సహకారం బాగుంటుంది. దాంపత్య సుఖం చక్కగా ఉంటుంది. పాత పెట్టుబడుల నుండి మంచి లాభాలందుతాయి. అప్పులు తీరుస్తారు. భాగస్వామి నుండి మంచి తోడ్పాటుంటుంది. వ్యాపారవృద్ధికి ప్రయత్నాలు చేస్తారు. ఉద్యోగులకు చాలా మంచి కాలము. దొంగ చాటు శత్రువుల ఆటలు సాగవు.

# పంచభూతాలు ఇంట్లో వుంటే అది నందనవనమే!

*డాక్టర్ సురేష్‌చంద్ర హైదరాబాద్*

** పంచ భూతాలు, వాస్తు, భూమి, శరీరం వీటి సంబంధాలను చెప్పండి?*

త్రివిధ వాస్తు శాస్త్రజ్ఞులు 28 మంది మీ సిద్ధాంతాన్నే చెప్పారు. వాస్తు, భూమి, శరీరం పంచ భూతాత్మక సిద్ధాంతానికి అతీతం కాదు. పంచ భూతాలు గృహంలో నివసిస్తే గృహస్థు ఆనందంగా ఉంటాడన్నది సూక్తి.

*పి.టి.అరవింద కర్నూలు*

** గృహంలోని ఏ గదిలో 'తులసి' మొక్కను పెంచవచ్చు?*

వంట, స్నాన గదుల్లో తప్ప ఎక్కడైనా, ఏ దిక్కులోనైనా తులసి మొక్కను పెంచవచ్చు. అయితే కుండీ నేలను తాకరాదు.

*టి.సూర్యతేజ సూళ్లూరుపేట*

** భూ వాతావరణాన్ని గురించి చెప్పండి? వాస్తుశాస్త్ర విశ్లేషణలు రాయండి?*

భూమి, గృహం, మనిషి, సముద్రం పోలికలున్నాయి వాస్తుశాస్త్రంలో. భూమి, గృహం అయస్కాంత దిశాక్షేత్రాలు, పంచభూత స్థానాల వల్ల మనుగడ సాగిస్తున్నాయి విశ్వామిత్ర వాస్తు ప్రకారం. అగస్త్య వాస్తులో మనిషికి సముద్రానికి పోలికలున్నాయి. ఈ సమిష్టి శక్తే భూ వాతావరణం. దీనివల్లే వాయువులు, సముద్రాలు ఆవిరి అయిపోకుండా వున్నాయి.

*ఎన్.తిరుపాల్ రెడ్డి పొదలకూరు*

** 'వృక్షం' తీసివేసి నానా బాధలు పడుతున్నాను.*

'వృక్షవేధ' మూడు, ఆరు, తొమ్మిది సంవత్సరాలని కాశ్యప వాస్తు చెబుతున్నది. 'సుదర్శన రక్ష' మీ బాధను వ్యధను తగ్గిస్తుంది.

*కె.భాస్కరాచార్య కలిగిరి*

** దృష్టి వున్నదా? దిష్టితీతకు విలువున్నదా?*

ఆధ్యాత్మికం, ప్రేతాత్మకం, అరిషడ్వర్గాత్మికం అని దృష్టి భేదాలు మూడు. దృష్టి వున్నది. 'దిష్టి తీత' పూర్తిగా మానసికం, 'దిష్టి' ప్రవహించే కాలువల్లో పోయాలి. రోడ్ల కూడళ్లలో కాదు. ఇది ప్రేతాత్మక చేష్ట.

*పి.ఈశ్వరదత్తు ఆత్మకూరు*

** రత్నాలు పొదిగిన ఆభరణాలు. దోషనివారణలెలా?*

నవరత్నాలలో నీలం, గోమేధుకం, వైడూర్యం పూజా గదిలో వుంచడం వల్ల మిగతా రత్నాలు కర్పూరం, నిమ్మకాయ వుంచిన పేటికలో రాత్రిళ్లు వుంచడం వల్ల దోష నియుక్తమవుతాయి.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*షేక్ ఖుస్రుద్దీన్ నెల్లూరు*

** అల్లారుముద్దుగా పెంచినందుకా శిక్ష? వీడు బాగుపడతాడా?*

కుడి చిటికెన వ్రేలికి వైడూర్యం(ప్రథమార్ధ) ధరింపజేయండి. 'వాస్తురక్ష'ను ప్రార్థనా గదిలో ప్రతిష్టించుకోండి.

*పరిగుందల జలజాక్షి బద్వేలు*

** సిద్ధాంతులు చెప్పిన రత్నధారణకు కొందరు 'బత్తులు'(స్వర్ణకారులు) వ్యతిరేకిస్తున్నారు.*

నమ్మకం ధరించేవారిది. నవరత్న ఉంగర నిర్మాణం స్వర్ణకారులది. ప్రశ్నించడం శాస్త్రాన్ని అనుమానించడమే.

*దిన్నకంటి అవినాష్ నెల్లూరు*

** రోగాలు, మృత్యువులు చూశాక జంతు బలి ఇవ్వాలని సిద్ధాంతి చెప్పారు.*

ప్లాటులో అవాస్తు దోషాలు విపరీతం. వాటిని సరిచేసుకోవడమో, యంత్రప్రతిష్ట చేయడమో చేయాలి. జంతుబలి 'కుమారుల్ని, కుమార్తెల్ని' భ్రష్టుల్ని చేస్తుందని వశిష్ఠ వాస్తు వ్యాఖ్యానిస్తోంది.

*చతుర్వేదుల ప్రమీల ఒంగోలు*

** ఈశాన్యం మూల 'పూజకుండ'ను గురించి గతంలో రాశారు.*

'మృణ్మయభాండ' స్థాపన గృహాలకే, అపార్టుమెంటు ప్లాట్లకు సాధ్యం కాదు. అనారోగ్య, ఆర్థిక వేధలు విపరీతంగా వుంటేనే ఆ పద్ధతి పనికి వస్తుంది.

# సింహాద్రి సామాన్యుడు కాడు!

**బోగోలు మండలంలో సింహాద్రి పేరు తెలియని వారుండరు. ఇందిరక్రాంతి పథంలో ఎపిఎంగా వుద్యోగంతోపాటు ఇటీవల వరకు ముంగమూరు తోటల వద్ద ఎయిడ్స్ రోగులకు బోగస్ ఆదరణ కేంద్రం నిర్వహించాడు. వెంకటేశ్వరపాళెంలో ఇంగ్లీషు మీడియం స్కూల్ కూడా నడుపుతున్న ఇతను చేసే అవినీతి, అక్రమాలకు అంతే లేదు.**

అతని పేరు సింహాద్రి. ఇందిర క్రాంతి పథంలో ఎపిఎంగా విధులు నిర్వహిస్తున్నాడు. ప్రవృత్తిగా ఇటీవల వరకు భవాని ఎడ్యుకేషనల్ సొసైటీ పేరుతో బోగోలు మండలం ముంగమూరు తోటల వద్ద ఎయిడ్స్ ఆదరణ కేంద్రాన్ని నిర్వహించాడు. ఈ ఆదరణ కేంద్రం నిర్వహణకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విడుదల చేసిన నిధులు దుర్వినియోగం జరిగినట్లు నిర్ధారణ కావడంతో కేంద్ర ప్రభుత్వం ఎయిడ్స్ ఆదరణ కేంద్రాన్ని మూసివేయాలని ఆదేశించింది.

ఒక ప్రక్క ఎయిడ్స్ ఆదరణ కేంద్రం నిర్వహణ, మరో ప్రక్క ఇందిర క్రాంతి పథంలో ఎపిఎం బాధ్యతలు ఇంకో ప్రక్క ఇదే మండలంలోని వెంకటేశ్వరపాళెంలో ఇంగ్లీషు మీడియం పాఠశాలను నిర్వహిస్తున్నాడు. మూడు బాధ్యతలను ఒకేసారి నిర్వహించాల్సి రావడంతో ప్రభుత్వ విభాగమైన ఇందిర క్రాంతి పథంకు న్యాయం చేయలేక పోతున్నాడు. ఇతనికి కేటాయించిన గ్రామాలలో కూడా సక్రమంగా పర్యటించడం లేదు.

వెంకటేశ్వరపాళెంలో నిర్వహిస్తున్న ఇంగ్లీషు మీడియం పాఠశాలకు విద్యార్థుల్ని తీసుకవచ్చేందుకు వ్యాన్ ఏర్పాటు చేయబడింది. ఈ వ్యాన్ ఇటీవల పాఠశాల నుంచి విద్యార్థులను తీసుకెళ్లే సమయంలో తాటిచెట్లపాళెం శివారున బోల్తా కొట్టింది. ఈ ప్రమాదంలో ఏడుగురు విద్యార్థులకు తీవ్ర గాయాలు కాగా మరో పది మందికి స్వల్ప గాయాలయ్యాయి. వ్యాన్ నడిపింది ఎపిఎం సింహాద్రి కుమారుడు శరత్‌చంద్ర. ఈ విషయం తెలుసుకున్న సింహాద్రి ప్రమాదస్థలికి చేరుకుని కొడుకును తప్పించేందుకు ప్రయత్నించడం జరిగింది. అప్పటికే అక్కడికి చేరుకున్న తాటిచెట్లపాళెం గ్రామస్తులు సింహాద్రిని నిర్బంధించారు.

ఇంతకు ముందు పొదుపు మహిళలకు రుణాలు, వికలాంగులకు పెన్షన్లు ఇప్పిస్తానని చెప్పి గ్రామంలో కొంత నగదు వసూలు చేశాడట. సంవత్సరం గడిచినా రుణాలు, పెన్షన్ అందకపోవడంతో మహిళలు మరింత ఆగ్రహం వ్యక్తం చేస్తూ దుర్భాషలాడారు. దాదాపు ఆరు గంటలపాటు గ్రామంలో నిర్బందించారు. వ్యాన్ ప్రమాదానికి గురి చేయడం, మరో ప్రక్క ఎపిఎం హోదాలో పొదుపు మహిళల నుంచి నగదు వసూలు చేసి అడ్రస్ లేకుండా పోవడంతో మహిళలు ఆగ్రహించారు. కొంతమంది పెద్ద మనుషులు రంగ ప్రవేశం చేసి మహిళలకు సర్ది చెప్పడంతో వారు శాంతించారు. మహిళల నుంచి వసూలు చేసిన నగదును మరుసటి రోజు చెల్లించాడు.

*ప్రభుత్వ నిధులు ఆగినా ముంగమూరు తోటల వద్ద చూపుడుకు సింహాద్రి నడుపుతున్న ఎయిడ్స్ రోగుల ఆదరణ కేంద్రం.*

ఇతని పనితీరుపై అక్కడ మహిళలు తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. పాఠశాల నిర్వహిస్తూ ఇందిరక్రాంతి పథం ఆధ్వర్యంలో అమలు చేసే కార్యక్రమాలపై దృష్టి సారించలేక పోతున్నాడన్న విమర్శలు వున్నాయి. పొదుపు గ్రూపు మహిళలకు బ్యాంకు లింకేజి రుణాలు మంజూరుకు ఎపిఎం కృషి చేయాల్సి వుంటుంది. దీంట్లో కూడా ఇతను చేతివాటం ప్రదర్శిస్తున్నాడు. ఇతను ఇంతకు ముందు అల్లూరు మండలం కమ్యూనిటీ కో – ఆర్డినేటర్‌గా విధులు నిర్వహించిన సమయంలో పలు ఆరోపణలు ఎదుర్కొన్నాడు. ఎపిఎంగా పదోన్నతి పొంది బోగోలు మండలానికి బదలీ అయ్యాడు. అయినా కూడా ఇతనిలో ఎటువంటి మార్పు కానరాలేదు. ఎయిడ్స్ ఆదరణ కేంద్రం నిర్వహిస్తున్నాడన్న జాలితో ఇతనిపై ఎన్ని ఆరోపణలు వచ్చినా కూడా అధికారులు చూసీ చూడనట్లుగా పోతూ వచ్చారు. ప్రస్తుతం ఆదరణ కేంద్రం మూసి వేయబడింది. ఇప్పటికైనా అధికారులు స్పందించి ఎపిఎం సింహాద్రిపై వచ్చిన అవినీతి, ఆరోపణలపై విచారణ చేపట్టాల్సిన అవసరం వుంది.

J

అవినీతి కథ

*తమనూ పర్మినెంట్ చేయాలని కార్పొరేషన్ చివరి సమావేశంలో గొడవకు దిగిన తాత్కాలిక కార్మికులను సముదాయిస్తున్న కమిషనర్.*

● చివరి నిమిషంలో

# చక్రం తిప్పిన భానుశ్రీ!

**కార్పొరేషన్ చివరి సమావేశంలో 23మంది శానిటరి తాత్కాలిక వుద్యోగులను పర్మినెంట్ చేసే ప్రక్రియలో ఒక్కొక్కరి నుంచి మేయర్ భానుశ్రీ లక్ష రూపాయలు వసూలు చేసిందన్న ఆరోపణలు వెల్లువెత్తాయి. వీరిలో కొందరు ఆమె స్వగ్రామస్తులు కావడం విశేషం.**

మునిసిపల్ కార్పొరేషన్ పాలకవర్గం కొంతమంది ఎన్ఎంఆర్‌లను పర్మినెంటు చేసేందుకు నిర్ణయించింది. ఎంతోమంది కార్మికులు సొసైటీల ద్వారా మునిసిపల్ కార్పొరేషన్‌లోని వివిధ విభాగాలలో విధులు నిర్వహిస్తున్నారు. కార్పొరేషన్ రికార్డులలో పేరు నమోదుకాని 23మందిని పర్మినెంటు చేయాలని నిర్ణయించడం వివాదాస్పదంగా మారింది. పర్మినెంటు చేయాలని భావించిన 23 మంది కార్మికులు ఏ విభాగం పరిధిలో పని చేస్తున్నారన్న విషయం కూడా వెల్లడించలేక పోతున్నారు.

మునిసిపల్ కార్పొరేషన్, మునిసిపాలిటీలలో ఉద్యోగ నియామకాలకు సంబంధించి 1994 సంవత్సరంలో ఎన్.ఎం.ఆర్ విధానంపై ప్రభుత్వం నిషేధం విధించింది. కార్పొరేషన్‌కు అవసరమైన సిబ్బందిని సొసైటీల ద్వారా నియమించుకోవచ్చని ఉత్తర్వులు జారీ చేయడం జరిగింది. ప్రస్తుతం వివిధ సొసైటీల తరపున వందలాది మంది కార్మికులు పారిశుధ్య పనులు చేస్తున్నారు. పర్మినెంటు చేసేందుకు గుర్తించిన వారిలో ఒక్కరు కూడా సొసైటీలకు చెందినవారు లేకపోవడం విశేషం. ఇటీవల జరిగిన కార్పొరేషన్ చివరి కౌన్సిల్ సమావేశంలో ఈ విషయమై రభస కూడా జరిగింది.

పర్మినెంటు చేసే కార్మికులు ఏ విభాగంలో ఎప్పటి నుంచి పని చేస్తున్నారు? వారి పేర్లను వెల్లడించాలని కార్పొరేటర్లు పట్టుబట్టినా మేయర్‌తోపాటు కార్పొరేషన్ అధికారులు ఎవరు కూడా నోరు మెదపలేదు. అజెండాలో చేర్చిన ఈ అంశంపై సిపిఎం, తెలుగుదేశం కార్పొరేటర్లు ఎంత నిలదీసినా సమాధానం చెప్పలేని పరిస్థితి ఏర్పడింది. కార్పొరేషన్‌లోని హెల్త్ విభాగం నుంచి 23 మంది కార్మికులను పర్మినెంటు చేయాలన్న ప్రతిపాదన వచ్చిందని కమిషనర్ చెబుతుండగా, ప్రభుత్వం నుంచి వచ్చిన ఆదేశాల మేరకే ప్రతిపాదనలు పంపినట్లు హెల్త్ ఆఫీసర్ సుబ్బరాజు అంటున్నాడు.

మేయర్ భానుశ్రీ, ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి, కమిషనర్ నివాసాల్లో పనిచేసే వారి పేర్లతోపాటు భానుశ్రీ కొంత మొత్తాలు తీసుకొన్న వ్యక్తులను పర్మినెంటు చేసే జాబితాలో చేర్చినట్లు ఆరోపణలు వున్నాయి. భానుశ్రీ బంధువైన నందిమండలం గోవిందరాజు ట్రాక్టర్ డ్రైవర్‌గా పని చేసి పదవి విరమణ చేశారు. ఈయన తన పరపతి పలుకుబడి ఉపయోగించి హెల్త్ విభాగంలో రెండు పోస్టుల్ని తనకు కావాల్సిన వారికి ఇప్పించుకున్నట్లు తెలుస్తుంది. అసలు మునిసిపల్ కార్పొరేషన్‌లో ఎన్.ఎం.ఆర్ విధానం లేదు. ఎన్.ఎం.ఆర్‌లను పర్మినెంటు చేయాలని ప్రతిపాదించడం ఆశ్చర్యం కలిగిస్తుంది.

పర్మినెంటు చేయాలని భావించిన 23మంది నుంచి భారీ మొత్తం వసూలు చేసినట్లు ప్రచారం జరుగుతుంది. ఒక్కొక్కరు 50వేల నుంచి లక్ష రూపాయల వరకు మేయర్, కమిషనర్, హెల్త్ అధికారులకు ముట్టచెప్పారని కార్యాలయంలో గోలగోలగా వుంది. నగదు వసూలు చేసే బాధ్యతను హెల్త్ ఆఫీసర్ సుబ్బరాజు తీసుకున్నాడు. అనేక సంవ త్సరాల నుంచి సొసైటీల తరపున పారిశుధ్య పనులు చేస్తున్న వారిని పర్మినెంటుకు ప్రతిపాదనలు పంపవచ్చు. అయితే ఇక్కడ మొత్తం ఏక పక్షంగా జరిగిపోవడంతో 23 మంది కార్మికుల వద్దకు వచ్చేసరికి అక్రమాలు ఒక్కసారి బయటపడ్డాయి.

పర్మినెంటుకు సంబంధించి ప్రభుత్వం జారీ చేసిన ఉత్తర్వులను బహిర్గత పరచేందుకు అధికారులు వెనుకంజ వేస్తున్నారు. పర్మినెంటు చేయబడే 23మంది ఎవరన్నది ప్రశ్నగా మిగిలిపోయింది. పాలకవర్గం గడువు ముగియడంతో ఇక అధికారులే మొత్తం పరిశీలన సాగించాల్సి వుంటుంది. ఈ క్రమంలో ప్రత్యేక అధికారిగా నియమితులైన అదనపు జె.సి సీతారామయ్య ద్వారా ప్రభుత్వానికి నివేదిక పంపి ఆమోదం పొందేందుకు పైరవీలు జరుగుతున్నాయి.

J



## మల్లిక కొత్త అవతారం

నిర్మాతలు అడగటమే పాపమన్నట్లు అందాలు బట్టబయలు చేసి బుసకొట్టిన మల్లికా షెరావత్ గాయని అవతారం ఎత్తబోతోంది. మల్లిక ప్రధాన పాత్రలో ఆమె పాముకన్యగా నటించిన 'హిస్' చిత్రం విడుదలవుతుంది. ఈ హాలీవుడ్ చిత్రంలో రెండు పాటలను మల్లిక పాడుతుంది. ఆమె గొంతు జీరగా వుండడంతో నిర్మాత ఓకె అన్నాడట. ముందు హిస్ ఆడియో రిలీజ్ జేసి అక్టోబర్ చివర ఈ చిత్రాన్ని విడుదల చేసేందుకు సన్నద్ధం అవుతున్నారు నిర్మాతలు. హిస్‌లో మల్లిక పాటలేగాక హాట్ సన్నివేశాలు బోలెడంటున్నారు.

## బికినీ భామగా విమలారామన్!



నయనతార, ప్రియమణి, అనుష్క, నమితల సరసన విమలారామన్ కూడా చేరబోతుంది. ఏమిటీ ఈ జాబితా అనే సందేహమా? బికినీలో జలకన్యల్లా దర్శనమిచ్చిన కథానాయికలు వారు. విమల కూడా బికినీలో అందాలు ఆర బోయను సిద్ధమవుతుంది. విమలారామన్ ఇప్పటికి అరడజనుకు పైగా తెలుగు చిత్రాల్లో హీరోయిన్‌గా నటించినా గాయం-2 మాత్రమే ఆమెకు కాస్త గుర్తింపు తెచ్చింది. ఈ రంగుల లోకంలో నెగ్గుక వచ్చేందుకు గ్లామర్ మంత్రం పఠించాల్సిందేనని ఈ భామకు అర్థమైపోయింది. సుమంత్ హీరోగా తీస్తున్న చిత్రంలో ప్రియమణితోపాటు విమల కూడా నాయికగా కనిపిస్తోంది. ఈ సినిమాలోనే బికినీ భామ ప్రియమణి వుండగా తనకూ ఆ స్థాయి క్రేజ్ అవసరమని విమలా భావించి బికినీ ధరిస్తుంది. ఇదేమిటమ్మా అని అడిగితే హీరోయిన్‌గా నిలదొక్కుకోను ఇంతకు మించి మరో మార్గం కనపడడం లేదంటుంది.

## మళ్లీ సోనియా అగర్వాల్!



7-జి బృందావన కాలనీ చిత్రంలో హీరోయిన్ సోనియా అగర్వాల్ ఈ చిత్రదర్శకుడు శ్రీరాఘవను ప్రేమించి పెళ్లి చేసుకొంది. ఇటీవల వీళ్లిద్దరూ విడిపోయారు. దీంతో సోనియా అగర్వాల్ మళ్లీ నటించడం మొదలు బెట్టింది. వేదం రీమేక్‌గా తమిళంలో రూపొందుతున్న వానమ్‌లో నటిస్తుంది. ఇటీవల హైదరాబాద్ వచ్చిన ఆమె పిచ్చాపాటీగా మాట్లాడింది. బృందావన కాలనీ విజయాన్ని సద్వినియోగం చేసుకోలేదు. ఇప్పుడు స్క్రిప్టుల ఆధారంగా గ్లామర్ పాత్రలలోనైనా నటిస్తా. ఇప్పటికే తెలుగులో రెండు కథలు విన్నాను. అవకాశమిస్తే తెలుగు చిత్రాల్లో నటిస్తానంటుంది.



## ఎలా అయినా ఓకే...

కొమరం పులి చిత్రం హీరోయిన్ నికిషా పటేల్‌ను నిరాశపర్చింది. మంచి బ్రేక్ వస్తుందని రెండున్నర సంవత్సరాలపాటు ఏ చిత్రంలో నటించలేదని, ప్రస్తుతం ఈ విధంగా అయ్యిందని వాపోతుంది. ఈ బాధతో ఏ భాషలోనైనా నటిస్తానంటుంది. నటించే చిత్రం పెద్ద సినిమానా... చిన్న సినిమా... లేక పరభాషా చిత్రమా అనే ఆలోచన లేదు. ఏ సినిమాల్లోనైనా నటిస్తా. కథ డిమాండ్ చేస్తే బికినీలోనైనా కనపడతానంటుంది. బాగా నిద్రపోవడం. బావర్చి బిర్యాని తినడం ఇదే నా దినచర్య. యోగా చేయడం వల్ల తన ముఖం కాంతులీనుతుంటుందని చెప్పుకొచ్చింది నికిషా.

## మమ్ముట్టి బాధ!



ఈసారి జాతీయ ఉత్తమ నటుడి అవార్డు తప్పకుండా వస్తుందని మళయాళ సూపర్‌స్టార్ మమ్ముట్టి ఊహించారు. ఆయన నటించిన కుట్టీశ్రంక్, కేరళ వర్మ, పజానీరాజా చిత్రాలు చూసిన విమర్శకులు ఆయనకు ఓటేశారు. కాని అందరి ఆలోచనలను తలక్రిందులు చేస్తూ అమితాబ్ గట్టిపోటీ ఇచ్చి ఉత్తమ నటుడి అవార్డు కైవసం చేసుకున్నారు. మనసులో బాధను బయటకు చెప్పకపోయినా తాను నిరుత్సాహ పడలేదని, ఇప్పటివరకు తాను నటించిన ఎనిమిది చిత్రాలకు జాతీయ అవార్డు రావడం పట్ల మమ్ముట్టి సంతృప్తి వ్యక్తం చేశారు. తాను బాగానే నటిస్తాను కాబట్టి అవార్డులు వాటంతట అవే వస్తాయన్న ఆత్మవిశ్వాసం వ్యక్తం చేశాడు.



## రోబో అద్భుతం!

✍ అల్లూరు రహీం

ఆసియా ఖండంలోనే అతి పెద్ద బడ్జెట్‌తో తయారైన తొలి చిత్రంగా గణుతికెక్కిన 'రోబో' వాస్తవంగా ఓ అద్భుత చిత్రరాజం. ఈ చిత్రాన్ని సన్ పిక్చర్స్ పతాకంపై కళానిధి మారన్ నిర్మించారు. వాసి గల చిత్రాలను తీసే దర్శకునిగా పేరు గాంచిన శంకర్ తన పదవ చిత్రాన్ని ప్రేక్షకులను మంత్రముగ్దులను చేసే తీరులో చిత్రీకరించడంలో విజయం సాధించాడనాలి. 200కోట్ల బడ్జెట్, 2250 ప్రింట్లు, తెలుగు, తమిళ, హిందీతోపాటు జపాన్ భాషల్లో విడుదల, హీరో రజనీకాంత్‌కు 40కోట్లు, హీరోయిన్ ఐశ్వర్యరాయ్‌కు ఆరుకోట్ల రూపాయల పారితోషికాలు జనానికి చిత్రంగానే తోస్తాయి. వీటికి మించి స్పెషల్ ఎఫెక్ట్స్‌కు కోట్లాది రూపాయలు వెచ్చించిన విషయం తెరపై స్పష్టంగా కనపడిపోతోంది. యానిమేషన్, ఎలక్ట్రానిక్స్, యానిమేట్రోనిక్స్ కలయికతో తయారైన ఓ 'రోబో' తెరపై కారు డ్రైవింగ్ చేస్తుంది. పుస్తకాలను స్కానింగ్ చేస్తూ చదివేస్తుంది. విపత్కర పరిస్థితుల్లో కాన్పు, కమ్మనైన వంట చేస్తుంది. ఇల్లు చక్కగా సర్దుతుంది. పిల్లవాడ్ని లాలిస్తుంది. అగ్ని ప్రమాద బాధితులను కాపాడుతుంది. ఒళ్లు గగ్గుర్పాటు చేసే పోరాటాలు చేస్తుంది. చివరికి తనను సృష్టించిన గురువుకే పంగనామాలు పెడుతూ ఆయన ప్రేయసిని ప్రేమిస్తుంది. తెగించి కిడ్నాప్ చేస్తుంది. వినాశకకారిగా తయారవుతుంది.

చకచకా సాగే స్క్రీన్‌ప్లేలో సందేహాలు కల్గకపోయినా సినిమా విడిచాక 100మంది శక్తి గల రోబో లోకల్ ట్రైన్‌లో వంద మందిని కొట్టను కష్టపడను విచిత్రమనిపిస్తుంది. ఊపిరితిత్తులు లేవు... గుండెబాధ లేదని చెప్పే రోబో మానవ స్పందనలు అర్థం చేసుకొనే స్థాయి నుంచి ప్రేమించే వరకు వెళ్తుంది. చెత్తదిబ్బ నుంచి మళ్లీ శక్తిని పుంజుకోవడం, విలన్ కారులోనికి రావడం ఎలా అనే సందేహాలు కల్గుతాయి.

ఈ చిత్రంలో ఇంకో ప్రధాన లోపం అర్థం కాని పాటలు. తమిళ పాటలను తెనుగీకరించడంలో భువనచంద్ర విఫలమయ్యాడు. చిత్రీకరణ దిట్టయిన శంకర్ అందం మొత్తం నీవా, చిట్టి చిట్టి రోబో, మరమనిషి మన్మధుడై వచ్చాడు, అహ అహ, ఓ సొగసా పాటలను ఐశ్వర్య అందాలు, ప్రపంచ వింతల్లో ఒకటైన మచుపిచ్చు అందాలతో లాగించేశాడు. శ్రీరామకృష్ణ మాటలు మాత్రం సైన్స్ ఫిక్షన్‌లో సైతం అర్థమయ్యేలా వున్నాయి. ప్రాణమంటే డిఎన్ఏ, బాక్టీరియాకు ప్రాణం వుంది; సోడియంకు లేదు. మిషన్‌కు మనిషికి పుట్టిన బిడ్డను. ప్రేమిస్తే నట్టువూడుతుంది ఈ కోవలోనివే.

ఇక చిత్రకథలోనికి వెళ్తే శాస్త్రవేత్త డాక్టర్ వశీకరణ్ (రజనీకాంత్) ఎంతోకష్టపడి ఏ పనైనా చేయగల రోబోను సృష్టిస్తాడు. దీనికి చిట్టి అనే పేరు పెడతాడు. రోబో సృష్టి సమయంలో తన చుట్టూ వున్న ప్రపంచాన్ని మార్చిపోతాడు. దీనికిగాను ఆయన ప్రేయసి డాక్టర్ కోర్సు చదివే సన (ఐశ్వర్యరాయ్) విపరీతంగా బాధపడుతుంది. తాను చేసిన రోబో సైన్యానికి ఇవ్వాలన్నది వశీకరణ్ ఆలోచన. డిఆర్‌డిఏ శాస్త్రవేత్తల ముందు తన రోబోను పరీక్ష పెట్టగా శాస్త్రవిజ్ఞాన మండలి ఛైర్మన్ డాక్టర్ బోరా (డానీ) దానికి విచక్షణ లేదని నిరూపిస్తాడు. ఆ సమయంలో వశీకరణ్ దానికి విచక్షణా జ్ఞానాన్ని మరో చిప్ ద్వారా అందిస్తాడు. తనతో రోబోను తీసుకెళ్లే సన అది చేసే అద్భుతాలకు వుచ్చితబ్బిబైపోతుంది. టైటానియం బుగ్గపై ఆమె ఇచ్చే ముద్దుతో రోబో సనపై మనసు పారేసుకొంటుంది. మిలటరీ అధికారుల ముందు ప్రేమ వేదాంతం వల్లించడం, తన ప్రేయసితో తన ప్రేమకు అడ్డురావడంతో వశీకరణ్ దాన్ని ముక్కలు చేసి చెత్తలో పారవేస్తాడు. కాని సనపై ప్రేమతో అది మళ్లీ రోబోగా తయారై డాక్టర్ బోరో చేతికి చిక్కుతుంది. ఆయన దానికి విధ్వంసక చిప్‌ను అనుసంధానం చేస్తాడు. ఇక రోబో చేసే విధ్వంసం తెరపై చూపి ఆశ్చర్యపోవాల్సిందే.

శాస్త్రవేత్తగా, రోబోగా రజనీకాంత్ ప్రతి ఫ్రేమ్‌లో అద్భుతంగా నటించాడు. విశ్వసుందరి ఐశ్వర్యరాయ్ వన్నె చిన్నెలు వెండితెరపై చూసి తృప్తి చెందాల్సిందే. ఏది ఏమైనా వెండితెరపై రోబో లాంటి అద్భుతాన్ని ఆవిష్కరించిన శంకర్ అభినందనీయుడు.



## వెన్నెలకంటికి మరుపూరువారి అవార్డు!



రచయిత వెన్నెలకంటికి మరుపూరు స్మారక అవార్డును ప్రదానం చేస్తున్న గాయని జానకి.

సుప్రసిద్ధ రచయిత, కళాప్రపూర్ణ మరుపూరు కోదండరామిరెడ్డి స్మారక అవార్డు ప్రదానోత్సవ సభ ఆహుతులు, కళా హృదయులు, అభిమానుల నడుమ అక్టోబర్ 2వ తేది టౌన్‌హాల్‌లో హృద్యంగా సాగింది. నెల్లూరీయుడు, అనువాద చిత్రాల రచయితగా పేరుగడించిన వెన్నెలకంటి రాజేశ్వరప్రసాద్‌కు ఈ ఏడాది మరుపూరు వారి పేరిట పెట్టిన అవార్డును అందజేశారు. ఈ కార్యక్రమానికి విఖ్యాత గాయనీమణి ఎస్.జానకి ముఖ్య అతిథిగా విచ్చేయగా, జిల్లా కలెక్టర్ రాంగోపాల్, ఎస్పీ దామోదర్‌లు హాజరయ్యారు. ఎన్నో మంచి పాటలు, మరెన్నో చిత్రాలకు మాటలు వ్రాసిన వెన్నెలకంటికి మరుపూరు కోదండరామిరెడ్డి అవార్డును అందజేయడం పట్ల జానకి హర్షం వ్యక్తం చేశారు. ఆయన వ్రాసిన ఎన్నో పాటలను తాను పాడటం జరిగిందని ఆమె చెప్పారు. అవార్డు స్వీకర్త వెన్నెలకంటి మాట్లాడిన తీరు ఆకట్టుకొంది. జన్మభూమైన నెల్లూరుతో, మరుపూరు కోదండరామిరెడ్డితో తనకు గల సాన్నిహిత్యాన్ని నెమరు వేసుకొన్నారు. తల్లిలాంటి జానకమ్మ చేతుల మీదుగా అవార్డు అందుకోవడం పట్ల సంతోషం వ్యక్తం చేసిన ఆయన ఒక దశలో ఉద్వేగానికి గురై కన్నీళ్లు పెట్టుకొన్నారు. జన్మజన్మలకు నెల్లూరీయుడుగానే పుట్టాలని, పెన్న నీరు త్రాగాలని, నెల్లూరు మొలగొలుకులతో భోజనం చేయాలని అభిలషించారు. జిల్లా కలెక్టర్ రాంగోపాల్, ఎస్పీ దామోదర్‌లు మరుపూరు కోదండరామిరెడ్డి గొప్పదనాన్ని, జానకి గాన మాధుర్యాన్ని ప్రశంసించారు. ఈ సందర్భంగా జీ సరిగమప విజేతలైన శ్రావ్య, నాదప్రియలు ఆలపించిన వివిధ గీతాలు అలరించాయి. ఈ కార్యక్రమంలో బివి నరసింహం, హజరత్‌బాబు, అనంత్ తదితరులు పాల్గొన్నారు.

## నమ్మకమైన శ్రీలక్ష్మీప్రసన్న డెవలపర్స్

### అప్పయ్యగేటు వద్ద కొత్త వెంచర్



ప్రమోటర్ వై.జయరామిరెడ్డి.

పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్న సింహపురి నగరంలో వివిధ సంస్థలు రియల్ ఎస్టేట్ వ్యాపారం సాగిస్తున్నప్పటికీ ఖాతాదారుల నమ్మకాన్ని వమ్ము చేయకుండా లే అవుట్‌లు వేస్తూ విశేష ఆదరణ సంపాదించుకొన్న సంస్థ శ్రీలక్ష్మీప్రసన్న డెవలపర్స్. ద్వారకానగర్‌లో వేసిన లే అవుట్‌ను విజయవంతంగా పూర్తిచేసిన సంస్థ అనంతరం బృందావనం లే అవుట్‌ను, చెముడుగుంట వద్ద మధురానగర్ లే అవుట్‌ను రూపొందించింది. దీనితోపాటు అప్పయ్యగేటు వద్ద ఎలెపినగర్ లే అవుట్‌ను అన్ని హంగులతో, డిటిసిపి అప్రూవల్‌తో ఏర్పాటు చేసింది. సంస్థ నిర్వాహకుడు ఏకొల్లు జయరామిరెడ్డి మాట్లాడుతూ ద్వారకానగర్, బృందావనం లే అవుట్‌లలో ఖాతాదారులకు పెట్టిన పెట్టుబడి ఆరు నెలల్లోనే రెట్టింపు అయ్యిందన్నారు. మధురానగర్‌లో 30 అంకణాల స్థలంలో ఆరు అంకణాల స్థలంలో సింగిల్ బెడ్‌రూమ్ ఆరు లక్షలకు, ఎనిమిది అంకణాల కట్టుబడితో డబుల్ బెడ్‌రూమ్ ఏడు లక్షలకు అందిస్తున్నట్లు చెప్పారు.

## నెల్లూరుతో విడదీయరాని బంధం



మనసులో మాట చెప్పిన జానకి.

తన తీయని కంఠంతో వివిధ భాషల్లో వేలాది పాటలు పాడి అశేష అభిమానులను సంపాదించుకొన్న ఎస్.జానకి మరుపూరు అవార్డు ప్రదానోత్సవం సందర్భంగా నగరానికి విచ్చేశారు. ఈ సందర్భంగా సింహపురి సీమతో తనకు గల అనుబంధాన్ని గుర్తు చేసుకొన్నారు. ఫన్ డాక్టర్ చంద్రశేఖరం ఇంటి కోడలిగా రావడంతోనే నెల్లూరు తన మెట్టినిల్లయ్యిందని, ఆనాటి నుంచి తనకు నెల్లూరుతో విడదీయరాని బంధం ఏర్పడిందన్నారు. పేరుకు మెట్టినిల్లయినా ఇది పుట్టిల్లుతో సమానమన్నారు. పలు సంస్థలు ఎన్నో అవార్డులను ప్రదానం చేసినా ప్రజల అభిమానం ముందు అవన్నీ దిగదుడుపేనన్నారు. పత్రికల గురించి ఆమె వ్యాఖ్యానిస్తూ పత్రికలు, జర్నలిస్టులు నిజాలు వ్రాయరు. మనం చెప్పింది ఒకటైతే వారు మరొకటి వ్రాస్తారు. అందుకనే ఇంటర్వ్యూలు ఇవ్వడం మానుకొన్నానని చెప్పారు. ఎన్ని జన్మలెత్తినా అభిమానుల రుణం తీర్చుకోలేనిదని జానకి వినమ్రంగా చెప్పారు.

## ఆర్ - 9000లో ఛార్మి

### పునః ప్రారంభం సందర్భంగా తగ్గింపు ధరలు



షోరూంను ప్రారంభిస్తున్న నటి ఛార్మి. ప్రక్కన ఎమ్మెల్యేలు వివేకానందరెడ్డి, శ్రీధర్‌కృష్ణారెడ్డి.

వస్త్ర వ్యాపారంలో ప్రవేశించి సింహపురి సీమలో తనకంటూ ఒక ప్రత్యేకతను చాటుకొన్న ఆర్ - 9000 సరిక్రొత్త హంగులు సంతరించుకొంది. పినాకినీ సూపర్ మార్కెట్ భవనంలో గల ఈ షోరూం క్రొత్త సొబగులతో, విస్తృతమైన మోడళ్లతో నేటి ఫ్యాషన్‌కు తగినట్లు వివిధ రకాల వస్త్రాలతో కొలువుతీరింది. ఈ నూతన షోరూంను అక్టోబర్ 2వ తేది ప్రముఖ సినీ నటి ఛార్మి ప్రారంభించగా, ముఖ్య అతిథులుగా జంట ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డిలు విచ్చేశారు. ఛార్మింగ్ బ్యూటీ ఛార్మి ఆర్ - 9000లోని పలు వస్త్రాలను పరిశీలించడమేకాక, తనకు నచ్చిన చీరలను ధరించి ఆకట్టుకొంది. షోరూం పునః ప్రారంభం సందర్భంగా అధినేత హరిబాబు మాట్లాడుతూ కస్టమర్లను దృష్టిలో వుంచుకొని విభిన్న రకాల వస్త్రాలను అందుబాటులో తెచ్చామన్నారు. అన్నిరకాల వస్త్రాలను కొనుగోలు ధరలకే అమ్మడంతోపాటు, వివిధ ఆఫర్లను ప్రకటించామన్నారు. ప్రముఖ బ్రాండెడ్ వస్త్రాలు, డిజైనర్ చీరలు, పట్టు, చేనేత వస్త్రాల నుంచి చిన్నపిల్లల దుస్తుల వరకు అన్నింటినీ అందుబాటు ధరల్లో వుంచినట్లు చెప్పారు.

## గద్దర్

మొదటి పేజీ కొరవ

కోరుకొనే వారందరికీ కెసిఆర్ తప్ప వేరే గత్యం తరం లేదు. ఇష్టం వున్నా లేకపోయినా ఆయన వెంట నడవక తప్పడం లేదు.

ప్రత్యేక తెలంగాణా కోరిక అంత ఉధృతం కావడానికి కారణం అక్కడి కళాకారులు, రచయి తలు, ప్రజాసంఘాల నేతలు, విద్యార్థులు మాత్రమే. కెసిఆర్ ఉపన్యాసాల కంటే వీరి ఉద్బోధల పట్లనే ప్రజలు ఎక్కువగా ఆకర్షితులౌతున్నారు. తెలంగా ణాలో మొదటి నుంచి ప్రజా ఉద్యమాలలో కళా కారుల పాత్ర ఎక్కువ. పాటకు, ఆటకు అక్కడ ఎన లేని రాజకీయ ప్రాధాన్యత వుంది. పుచ్చలపల్లి సుందరయ్య నడిపిన రైతాంగ పోరాటమైనా, కొండ పల్లి సీతారామయ్య నడిపిన పీపుల్స్‌వార్ అయినా పాటల మీదనే ప్రవహించాయి. అయితే ఈ కళా కారులకు కెసిఆర్ అంటే ఎక్కడలేని ఒళ్లు మంట. ఆయన వెలమ దొరతనం పోకడలు చూస్తే వంటికి కారం రాచినట్లు చిరచిరలాడతారు ఎవరైనా. ఇంతకాలం అన్యధా శరణం నాస్తి అన్నట్లు ఆయన్నే పట్టుకొని ఊగులాడవలసి వచ్చింది. నిన్నమొన్నటి వరకు గద్దర్ కూడా ఎంతో కొంత దూరం కెసిఆర్ తోనే నడిచాడు.

కానీ రోజురోజుకీ కెసిఆర్ పోకడ తెలంగాణ వాదులలో అసంతృప్తి, అసహనాలతో పాటు, అను మానాలు కూడా కల్గిస్తున్నది. గతంలో మర్రి చెన్నా రెడ్డి వలె ఆయన కూడా ఉద్యమాన్ని గోదాట్లో ముంచి సోనియా గాంధీతో ఒద్దిక పాటిస్తాడేమో అన్న భీతి నెలకొంటున్నది. అటువంటి వారందరినీ ఒక గాట కట్టేసి, ఉద్యమాన్ని మరింత చురుకుగా ప్రజలలోకి తీసుకువెళ్లడమే గద్దర్ ఫ్రంట్ ఉద్దేశం. గద్దర్ ఆ ప్రకటన చేసిన రోజు నుంచి తెలంగాణ కళాకారులు ప్రజా సంఘాలలో ఎక్కడలేని ఉత్సా హం పెల్లుబుకుతున్నది. తండోప తండాలుగా కదలి వస్తున్నారు. కెసిఆర్‌తో కలిసి నడవలేని సన్న జనం కూడా గద్దర్ నీడలో ఉద్యమోన్ముఖులౌతున్నారు. ఉద్యమ కార్యక్రమాలలో ప్రజల భాగస్వామ్యం చూడ వచ్చు ఇక నుంచి.

అయితే ఇంతకాలం ఊరుకుండిన గద్దర్ ఇప్పుడు వున్నట్లుండి ఎందుకు వీధిలోకి వచ్చాడ న్నది ప్రశ్న. నిజానికి ఇంత పెద్ద ఉద్యమం నడిపే ఆరోగ్యం గద్దర్‌కు లేదు. ఆయన ఆర్థిక వనరులు కూడా నామమాత్రమే. చాయ్ పైసలకు వెతుకు లాడే సగటు జీవి ఆయన. ఆయన వద్ద వున్న ఏకైక బలం – నమ్మిన సిద్ధాంతం పట్ల నిబద్ధత. చేపట్టిన కార్యక్రమం పట్ల పట్టుదల మాత్రమే. తన గొంతు తోనే ఫిరంగి ధ్వని విన్పించి ప్రత్యర్థుల గుండెలు దద్దరిల్ల చేయడం గద్దర్ నేర్చిన రణతంత్రం.

గద్దర్ రాకతో తెలంగాణా ఉద్యమ స్వరూ పమే మారిపోబోతున్నది. రాజకీయ లక్ష్యంతో కాక, ఉద్యమ సాఫల్యమనే అంతిమ గమ్యానికి ప్రయా ణించే అవకాశం లభించింది. విద్యార్థులు, పల్లె టూళ్లలోని దళితులు, వెనుకబడిన తరగతుల వారు మరింత ఉత్సాహంగా ఉద్యమంలో పాలుపంచు కోవడం ఖాయం. తెలంగాణా మొత్తం మీద పన్నులు కట్టకుండా సహాయ నిరాకరణ పాటించాలని పిలుపు ఇస్తున్నాడు గద్దర్. కెసిఆర్ వలె ఢిల్లీ పెద్దలను మచ్చిక చేసుకొని, లాలూచీ కుస్తీలతో ఉద్యమ గమ నాన్ని నిర్దేశించే పరిస్థితి ఇక తలెత్తదు. తాడోపేడో తేలే దశకు చేరుకొంటుంది. ఈ ఒత్తిడిని భరించే శక్తి ముఖ్యమంత్రి రోశయ్యకు ఎంత మాత్రం లేదు.

గద్దర్ ఫ్రంట్ ఆలోచన వెనుక చంద్రబాబు దన్ను వుందన్నది రాజకీయ పరిశీలకుల అను మానం. తెలుగుదేశం పార్టీకి తెలంగాణాలోని ప్రతి జిల్లాలో విస్తృతమైన కార్యకర్తల బలం వుంది. నాయ కత్వం వుంది. టిడిపి తెలంగాణ నేతలంతా కెసిఆర్‌తో కలవలేక, ఉద్యమానికి దూరం కాలేక నరక యాతన అనుభవిస్తున్నారు. కెసిఆర్ కూడా ఒక పథకం ప్రకారం తెలుగుదేశాన్ని శిథిలం చేయ డానికి ప్రణాళికలు రచిస్తున్నాడు. గత నెల రోజు లుగా ఆయన దాడి మొత్తం టిడిపి మీదనే కేంద్రీ కృతమౌతున్నది. రాజకీయ దూరదృష్టితో చేస్తున్న ప్రయత్నం ఇది. టిడిపిని దెబ్బతీయ గలిగితే కాం గ్రెస్‌కు తానే ప్రత్యామ్నాయం అవుతానన్నది ఆశ. నిజం చెప్పాలంటే కెసిఆర్ దాడికి చంద్రబాబు తుఫాను గాలికి తమలపాకు వలె చలించి పోతు న్నాడు. ఈ ప్రమాదాన్ని నివారించడానికి గద్దర్ ఫ్రంట్ ఆయనకు అన్నివిధాల ఉపయోగపడు తున్నది. తెలంగాణా టిడిపి నేతలందరూ గద్దర్ పేరుతో ఉద్యమంలో పాల్గొనవచ్చు. వారి బలం కలగలిస్తే ఉద్యమం కూడా బలపడుతుంది. ఉద్య మానికి సంకేతంగా కెసిఆర్ పేరు మాసి పోతుంది.

కారణం ఏదైనా కారకులు ఎవరైనా గద్దర్ తీసుకొన్న నిర్ణయంతో తెలంగాణాలో ఊహించని రాజకీయ పరిణామాలు సంభవించడం ఖాయం. ఉద్యమం అదుపు తప్పి పోవడమే తథ్యం. దాన్ని కాంగ్రెస్ పార్టీ ఎట్లా ఎదుర్కోబోతున్నదో వేచి చూడాలి.

## జనవాణి

2వ పేజీ కొరవ

ప్రకారం రామ జన్మభూమి. పురాతత్వ శాస్త్రజ్ఞులు సైతం అక్కడ వుండిన మసీదు క్రింద హిందూ సం స్కృతికి సంబంధించిన నిర్మాణాలున్నాయని పేర్కొ నింది. ముస్లింల పవిత్ర గ్రంథం ప్రకారం గతంలో విగ్రహారాధన జరిగిన చోట మసీదు నిర్మాణం సహే తుకం కాదు. కాబట్టి ముస్లిం సోదరులు మంచి మనసుతో అయోధ్యలోని వివాదాస్పద భూమిని హిందువులకు ఇచ్చివేస్తే బాగుంటుందని నా అభి ప్రాయం. ఈ పని భారతదేశంలోని మతసామ రస్యాన్ని ప్రపంచానికి చాటి చెబుతుంది.

షేక్ మహోలా — నెల్లూరు

## రాహుల్‌గాంధీ

5వ పేజీ కొరవ

రణల పేరిట అవలంభించిన పెట్టుబడిదారీ వ్యవ స్థను సమూలంగా నిర్మూలించి, ఇందిరమ్మ కలలు కన్న సామ్యవాద సమాజ నిర్మాణానికి పునాదులు వేస్తున్నాడు రాహుల్‌గాంధీ. భారతీయ రాజకీయాల లోనే కాక, మొత్తం ప్రపంచ ఆర్థిక వ్యవహారాల లోనే ఇదొక విప్లవాత్మక మార్పు. చారిత్రాత్మక ఘటన.

లోక్‌సభలో నాలుగు మాటలు మాట్లాడడా నికి తడబడిన యువకుడు ఐదేళ్లలో దేశ మౌలిక స్వరూపాన్నే మార్చివేయగల మేధావిగా, రాజనీతి జ్ఞుడిగా, సామాజిక శాస్త్రవేత్తగా ఎదగడానికి దారితీసిన పరిస్థితులేమిటి? అందుకు ప్రేరేపించిన వ్యక్తులు ఎవరు? రాజభవనం వీధి గౌతమ బుద్ధుడిగా మారిన సిద్దార్థుడి వలె రాహుల్‌గాంధీకి జ్ఞానోదయం కల్గించిన మర్రి చెట్టు ఏది? ఆ ముచ్చట్లు పై వారం చర్చించుకొందాము.




## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

14వ తేది భండాసురవధ అలంకారం, 15వ తేది దుర్గా అలంకారం, 16వ తేది మహిషాసురమర్థిని, 17వ తేది అశ్వవాహన సేవ జరుగుతాయని దేవస్థానం ఛైర్మన్ పిచ్చుక రమణయ్య, కార్యనిర్వ హణాధికారి వేగూరి రవీంద్రరెడ్డి చెప్పారు. ఉత్స వాల సందర్భంగా ప్రతినిత్యం ఉదయం పుణ్యాహవ చనం, కలశపూజ, రాత్రి నవావరణ పూజలు జరు గుతాయి. శ్రీ సూక్త పారాయణం, దేవీసప్తశత, దేవీ భాగవత పారాయణాలు సైతం జరుగుతాయి. భక్తులు అమ్మవారి కృపాకటాక్షాల కోసం జొన్న వాడకు వెళ్లాల్సిందే.

### సివిల్స్‌పై స్వర్ణభారత్‌లో అవగాహన!

యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్, ఎపి పబ్లిక్ సర్వీస్ కమిషన్ నిర్వహించే పరీక్షలకు హాజరు కావాలనుకొనే నెల్లూరు, ప్రకాశం, కడప, చిత్తూరు జిల్లాలకు చెందిన అభ్యర్థులకు 10వ తేది వెంకటాచలం స్వర్ణభారత్ ట్రస్ట్‌లో అవగాహన సదస్సు ఏర్పాటు చేస్తున్నారు. హైదరాబాద్‌కు చెం దిన లక్ష్య ఐఎఎస్ స్టడీ సర్కిల్ సహకారంతో జరిగే ఈ సదస్సులో నిష్ణాతులు కొడాలి భవానీశంకర్, అరుణ్‌మోహన్, విష్ణువర్ధన్‌రెడ్డిలు విలువైన సల హాలు ఇస్తారు. బిజెపి జాతీయ నేత ఎం.వెంకయ్యా నాయుడు. అన్నామలై యూనివర్శిటీ మాజీ వైస్ ఛాన్సలర్ బాల గురుస్వామి, తూర్పు గోదావరి జిల్లా కలెక్టర్ రవిచంద్ర, జిల్లా కలెక్టర్ రాంగోపాల్, ఎస్పీ దామోదర్, ఆదాయ పన్ను శాఖ అదనపు కమి షనర్ జె.కృష్ణకిషోర్, జెసి సౌరభ్‌గౌర్, చిత్తూరు జిల్లా జెసి ప్రద్యుమ్న, నెల్లూరు ఆర్డీఓ వేణుగోపాల్ రెడ్డి కూడా సదస్సులో సలహాలు, సూచనలు ఇస్తారు. స్వర్ణభారత్ చేస్తున్న కార్యక్రమాల్లో ఇదో మంచి కార్యక్రమమనొచ్చు. యువతీ యువకులు తీరిక చేసుకొని దీనికి హాజరైతే మంచిది.

### ఫిఫ్త్‌టౌన్ ఎస్ఐ సహాయం

నెల్లూరు త్రీటౌన్‌లో పనిచేసే సమయంలో దుందుడుకు పనిచేసిన ఎస్ఐ శ్రీనివాసులురెడ్డి ఐదవ పట్టణానికి బదలీ అయ్యాక బాగా మారారు. కత్తిపోట్లకు గురై ప్రాణాపాయస్థితిలో వుండిన ప్రగతినగర్‌కు చెందిన ఓ వ్యక్తిని వైద్యం కోసం నారాయణ హస్పిటల్‌లో స్వంత డబ్బు పదివేల రూపాయలు ముందస్తు డిపాజిట్‌చేసి ప్రాణాలు కాపాడారు. డబ్బులు పెరుక్కోవడం తప్ప సాయం అందజేయని పోలీసును కాదని లోకానికి చాటి చెప్పిన ఈ ఎస్ఐ అభినందనీయుడు.

### సందాని మరణం

సీనియర్ మునిసిపల్ కార్పొరేటర్, జెండా వీధి ముస్లింలకు పెద్ద దిక్కు హాజీ సయ్యద్ సందాని బాష 3వ తేది మరణించాడు. ఆయన వయస్సు 58 సంవత్సరాలు. నెల్లూరు మునిసిపల్ రాజకీ యాలలో ఒక ప్రబల శక్తి సందాని. 1981 నుంచి ఓటమి అన్నది ఎరగకుండా ప్రతి ఎన్నికలలోనూ గెలిచాడు. ఒకసారి వైస్‌ఛైర్మన్‌గా కూడా పని చేశాడు. చాలా కలుపుగోలు మనిషి. కార్యసాధ కుడు. మునిసిపల్ ఆఫీస్‌లో ఎవరికి ఏ పనిపడినా సందానీకి చెప్తే క్షణంలో జరిగిపోయేది. మునిసిపల్ మురికి రాజకీయాలలో కొంతవరకు నిజాయితీగా బ్రతికాడనే చెప్పవచ్చు. ఆయన మీద భూఆక్రమ ణల వంటి ఆరోపణలు తప్ప తతిమా కార్పొరేటర్ల వలె మునిసిపల్ నిధులు దోచుకొని తిన్నాడని ఒక్కరూ వేలెత్తి చూపేవారు కాదు. ఆ పరిస్థితి ఎప్పుడూ ఏర్పడలేదు. అయితే నిలకడలేని రాజ కీయవాది. కమ్యూనిస్టుల అండతో రంగంలోకి వచ్చి కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలన్నింటినీ ఒక చుట్టు చుట్టాడు. జనాన్ని మెప్పించే విద్య బాగా తెలుసు. అందువల్లనే ఒక్క జెండావీధికే కాక మొత్తం జిల్లాలో ముస్లింలకు పెద్ద దిక్కుగా ఎదిగాడు. దైవ భక్తి చాలా ఎక్కువ. ఒకసారి మక్కాకు కూడా వెళ్లి వచ్చాడు.

కానీ ఆర్థిక సమస్యలు సందానీని కృంగదీ శాయి. ఆ వత్తిడితోనే మనసు చంపుకొని ఆనం వారి ఆశ్రయం తీసుకొన్నాడు. ఆపదలో వున్నాడనే జాలి కూడా లేకుండా ఆనం సోదరులు సందానీని ఏడ్పించుక తిన్నారు. ఆ మానసిక సంఘర్షణ, ఆం దోళన సందాని ఆరోగ్యాన్ని దెబ్బ తీశాయి. ప్రాణం తీశాయి. జీవిత కాలం ధన సంపాదనకు తాప త్రయపడి కూడా భార్యాపిల్లలకు చిల్లి గవ్వ లేకుండా చేసి దాటుకొన్నాడు. దురదృష్టవంతుడు. వారి కుటుంబానికి మా ప్రగాఢ సానుభూతి.

● ఆశ్చర్యపరిచే తక్కువ ధరల్లో...

# జనరిక్ మందులు!

లాభాపేక్ష లేకుండా మందులు ప్రజలకు అందుబాటులోకి వచ్చాయి. నెల్లూరు రెడ్‌క్రాస్ సొసైటీ ఆధ్వర్యంలో "జనరిక్" మందులషాపు ఏర్పాటు ఇటీవల జరిగింది. రాష్ట్రమంత్రి ఆనం రామనారాయణరెడ్డి, జిల్లా కలెక్టర్ రాంగోపాల్ ఈ జనరిక్ మందుల షాపును ప్రారంభించారు. గుర్తింపు పొందిన మందుల కంపెనీలు తయారుచేసే మందులన్నీ ఈ జనరిక్ షాపులో అతి తక్కువ ధరకే విక్రయిస్తున్నారు.

మార్కెట్లో మందులను విక్రయించే షాపుల్లో ఎంఆర్పీ ధర కంటే అధిక ధరకు మందులను విక్రయించి సొమ్ము చేసుకొంటున్నారు. నెల్లూరు నగరంలో వున్న డాక్టర్స్‌ఫార్మసి, మెడ్‌ప్లస్ మందుల షాపుల్లో 10శాతం తగ్గింపు ఇస్తున్నారు. రెడ్‌క్రాస్ సొసైటీ ఆధ్వర్యంలో ఏర్పాటు చేసిన జనరిక్ మందుల షాపులో చాలా తక్కువ ధరకే మందులు దొరుకుతున్నాయి. బయట షాపులో పారాసిట్మాల్ టాబ్లెట్స్ షీట్ 30 రూపాయలు వుంది. ఇదే టాబ్లెట్స్ షీట్ జనరిక్ మందుల షాపుల్లో 9 రూపాయలకే విక్రయిస్తున్నారు.

### ప్రజలకు చేరువగా రెడ్‌క్రాస్!

జిల్లా ప్రజానీకానికి మరింత చేరువ కావాలన్న సంకల్పంతో రెడ్‌క్రాస్ సొసైటీ ఆధ్వర్యంలో జనరిక్ మందుల షాపును ఏర్పాటు చేయడం జరిగింది. ఎటువంటి లాభాపేక్ష లేకుండా మందులను విక్రయించడం జరుగుతుంది. కేంద్రప్రభుత్వం సూచనల మేరకే మందులషాపు నిర్వహణకు శ్రీకారం చుట్టాం. ఇప్పటికే రెడ్‌క్రాస్ రక్తనిధి ద్వారా రక్తం, ప్లేట్‌లెట్స్ తదితర సేవలను ప్రజలకు అందిస్తుంది. ప్రజలు తమకు అవసరమైన మందులు తక్కువ ధరకు ఇక్కడ లభిస్తుండడంతో కొనుగోలు చేయను ఎక్కువగానే వస్తున్నారు.

*వాకాటి రవీంద్ర,* రెడ్‌క్రాస్ ప్రతినిధి

## రాష్ట్రంలో మూడవ జిల్లా మనది!

మందుల కంపెనీలు సరఫరా చేసే ధరలకు మందుల షీట్లపై వున్న ధరలకు చాలా వ్యత్యాసం వుంటుంది. ఈ విషయం ఫార్మాసిస్టులు, డాక్టర్లకు మాత్రమే తెలుస్తుంటుంది. అయినా కూడా మరో పది శాతం ట్యాక్స్ విధించి వ్యాపారులు జనం వద్ద వసూలు చేస్తుంటారు. ఇప్పటికే బ్లడ్ బ్యాంక్ ద్వారా రక్తదానం, పొదలకూరురోడ్డులో క్యాన్సర్ ఆసుపత్రి విజయవంతంగా నిర్వహిస్తున్న రెడ్‌క్రాస్ సొసైటీ తాజాగా మందుల షాపును నిర్వహించేందుకు శ్రీకారం చుట్టింది. నగరంలో మద్రాస్ బస్టాండ్ సమీపంలో ఈ షాపును ఏర్పాటుచేయడం జరిగింది. వ్యాపార దృక్పథంగా కాకుండా ప్రజలకు రెడ్‌క్రాస్‌ను మరింత చేరువ చేయాలనే సంకల్పంతో దీనిని ప్రారంభించారు.

జిల్లా కోర్టు దగ్గర కొత్తగా పెట్టిన జెనరిక్ మందులషాపు.

జనరిక్ మందుల షాపులను దేశవ్యాప్తంగా ఏర్పాటుచేయాలని రెండు సంవత్సరాల క్రితం కేంద్రప్రభుత్వం ప్రతిపాదించింది. ప్రభుత్వ ఆస్పత్రుల ఆధ్వర్యంలో గానీ, రెడ్‌క్రాస్ సొసైటీ ఆధ్వర్యంలో గానీ వీటిని నిర్వహించాలని నిర్ణయించించింది. రాష్ట్రంలో విశాఖపట్నం, పశ్చిమ గోదావరి జిల్లాలో ఇప్పటికే జనరిక్ మందుల షాపులు నడుస్తుండగా మూడోదిగా నెల్లూరు నగరంలో ఏర్పాటు చేశారు.

మందుల షాపు నిర్వహణకు అవసరమైన నిధుల్ని రెడ్‌క్రాస్ సమకూరుస్తుంది. నగరంలో జనరిక్ మందుల షాపు ఏర్పాటు కావడంతో ఇతర మందులషాపు నిర్వాహకులు వ్యాపారపరంగా భయపడాల్సిన పరిస్థితి ఏర్పడింది. తక్కువ ధరకే మందులు దొరుకుతుండడంతో ఎక్కువగా ప్రజలు జనరిక్ మందుల షాపుకే వెళ్తున్నారు. దీంతో తమ వ్యాపారాలు ఎక్కడ దెబ్బతింటాయోనని ఆందోళన చెందుతున్నారు. గుర్తింపు కలిగిన అన్ని కంపెనీలకు చెందిన మందులు ఇక్కడ అందుబాటులో వుంచుతున్నారు.

పల్లెపాడులోని గాంధీ ఆశ్రమ అభివృద్ధికి ఐదు లక్షల రూపాయల చెక్కును రెడ్‌క్రాస్ జిల్లా కార్యదర్శి డాక్టర్ ఎ.వి.సుబ్రహ్మణ్యంకు అందజేస్తున్న కావలి మాజీ శాసనసభ్యురాలు మాగుంట పార్వతమ్మ.

తనను కాంగ్రెస్ పార్టీ నుంచి సస్పెండ్ చేయడాన్ని నిరసిస్తూ నెల్లూరు ఇందిరాభవన్‌కు తన అనుచరులు వేసిన తాళాలను తీస్తున్న పిసిసి కార్యదర్శి కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి.



నెల్లూరు గోల్డన్ జూబ్లీ హాల్‌లో జరిగిన సాగునీటి సలహా బోర్డు సమావేశంలో మాట్లాడుతున్న జిల్లా కలెక్టర్ రాంగోపాల్. ప్రక్కన మంత్రి రామనారాయణరెడ్డి, ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి.



మరుపూరు కోదండరామిరెడ్డి స్మారక అవార్డు ప్రదానోత్సవ సభలో తన గానంతో ఆకట్టుకొన్న గాయని సర్వేపల్లి శ్రేయను సన్మానిస్తున్న సినీగాయని జానకి. ప్రక్కన జిల్లా కలెక్టర్ రాంగోపాల్, ఎస్పీ దామోదర్, బివి.నరసింహం, మురళీకృష్ణ హజరత్‌బాబు.



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.